# శాంతి సామ్రాజ్యము

కర్త

'సాధనరహస్య' 'సర్వసిద్ధాంత సౌరభా'ది

బహు గ్రంథకర్తలగు

పరమహంస పరివ్రాజకాచార్య

## శ్రీ అనుభవానంద స్వాములవారు






ప్రకాశకులు :

శ్రీ అనుభవానంద గ్రంథమాల

బాపట్ల, గుంటూరు జిల్లా.

పండ్రెండవ కుసుమము,



ప్రథమ ముద్రణము — మార్చి 1953

ద్వితీయ ముద్రణము — ఏప్రిల్ 1976

మూల్యము రు. [illegible] 1-00

ముద్రణ :

వాణీప్రెస్, విజయవాడ-2

# విషయ సూచిక

# విరాళకర్తలు

## మహారాజపోషకులు రు. 516/- లు.

1 శ్రీ బలభద్రుని చెన్నయ్యశెట్టిగారు అండ్ సన్స్,
కమీషన్ మర్చంట్సు, ఆయిల్ మిల్సు, భీమునిపట్టణము.

2 శ్రీ పులపర్తి సుబ్రహ్మణ్యం శెట్టిగారు అండ్ సన్,
శ్రీ వెంకటేశ్వర ఆయిల్ మిల్స్ భీమునిపట్టణము.

3 శ్రీ నందగిరి వెంకట రామదాసు పంతులుగారు అండ్ సన్స్,
శిర్లపాలెము, భీమునిపట్టణము.

4. శ్రీ పూసపాటి రామచంద్రరాజుగారు. బి. ఇ,
రిటైర్డు ఎగ్జిక్యూటివ్ ఇంజనీరు, విశాఖపట్టణము.

5. శ్రీ కొత్తూరు రామయ్యగారు, టుబాకో మర్చంట్సు, గుంటూరు.

6. శ్రీ మెంటా ఈశ్వరయ్యగారు, కమీషన్ మర్చంట్స్, నెల్లూరు.

7. శ్రీ సాగి సత్యవతమ్మగారు, కొట్టాం, విశాఖజిల్లా.

8. శ్రీ దుర్గా వేంకట సత్యనారాయణమూర్తిగారు,
మర్చంట్స్, భీమునిపట్టణము,

9 శ్రీ టి పట్టాభిరాములుగారు,
ప్రొప్రయిటర్, కంబైండ్ ఆటో సర్వీసు, అనంతపురము.

## రాజపోషకులు

1 శ్రీ పసుమర్తి శేషాచలంగారు. క్లాత్ మర్చంట్స్. నెల్లూరు రు. 100

2 శ్రీ నూనె శేషాచలం శెట్టిగారు, రైస్‌మిల్స్ అండ్
కమీషన్ మర్చంట్స్ ,, 116

3 శ్రీ నూనె జగ్గయ్యశెట్టిగారు, రైస్‌మిల్స్ అండ్
కమీషన్ మర్చంట్స్ ,, 100

4 శ్రీ చిత్తూరు మునుస్వామి మొదలియార్‌గారు,
కమీషన్ మర్చంట్స్ ,, 116

5 శ్రీ యడ్లపల్లి గోవిందుశెట్టిగారు, ఐరన్ అండ్ ఫర్టిలైజర్సు ,, 116

6 గాలి నారాయణరావుగారు, ఎం ఏ., ఎల్. టి ,
రిటైర్డు ప్రిన్సిపాల్, నెల్లూరు రు. 100
7 డాక్టరు కె ప్రకాశరావుగారు, యం. బి. బి. యస్., ,, 100
8 డాక్టరు పి. రామచంద్రారెడ్డిగారు, యం. బి., బి. యస్ , ,, 100
9 వెలగపూడి సుందరరామ దత్తుగారు ,, 100
10 బిరుదవోలు రాజయ్య బ్రహ్మచారివారు.
శ్రీ దత్తాత్రేయ ఆశ్రమం, కనుపర్తిపాడు 100
11 సోమిశెట్టి సత్యనారాయణగారు, మెడికల్ షాపు, కందుకూరు 116
12 ఉప్పలపాటి సుబ్రహ్మణ్యంగారు, అడ్వకేట్, ఒంగోలు 100
13 డా॥ ఎన్. సుందరరాజారావుగారు, యం బి.,బి యస్., ,, 100
14 డా॥ జి రాఘవాచార్యులుగారు, యం బి ,బి యస్., ,, 100
15 త్రోవగుంట రమణమ్మగారు, ,, 100
16 శ్రీరాముల శ్రీనివాసరావుగారు, అడ్వకేట్ ,, 100
17 భక్తుడు ,, 100
18 రాచపూడి రామకోటేశ్వరరావుగారు, రిటైర్డు స్టేషనుమాష్టరు ,, 100
19 కూనపరెడ్డి అనసూయగారు, బి. ఏ , బి. యల్., ,, 100
20 డా॥ ఉప్పలపాటి గోపాలరావుగారు, ఆర్. ఎం. పి. అద్దంకి 100
21 అడుసుమల్లి శ్రీనివాసరావుగారు వేటపాలెం 100
22 డాక్టరు బూదరాజు వెంకట నరసింహారావుగారు, స్వర్ణ 101
23 బొలిశెట్టి సీతారామయ్యగారు, అడ్వొకేట్, బాపట్ల 232
24 బొడ్డుపల్లి సీతారామస్వామిశాస్త్రిగారు, ,, 100
25 పోలేపెద్ది సీతాలక్ష్మిగారు, ,, 100
26 డి. సత్యనారాయణరాజుగారు, మంతెనవారిపాలెం 116
27 మంతెన వెంకటరామరాజుగారు. బి. ఏ., బుద్దాం 116
28 కొత్తూరు రామయ్య అండ్ కర్పూరపు రామకృష్ణమూర్తి
కంపెనీ, టుబాకో మర్చంట్స్, గుంటూరు 100
29 పోలిశెట్టి సోమసుందరంగారు, టుబాకో మర్చంట్స్, ,, 100
30 కర్పూరపు వెంకటనారాయణగారు, ,, ,, 100
31 పంకాయల కోటేశ్వరుడుగారు, ,, ,, 100

| | | | |
|---|---|---|---|
| 32 | శ్రీ కర్పూరపు కనకవల్లితాయారమ్మగారు, | గుంటూరు రు. | 100 |
| 33 | బొలిశెట్టి హనుమంతరావుగారు, విజయా అండ్ కో., | ,, | 100 |
| 34 | గుడివాడ పుల్లారావుగారు | ,, | 100 |
| 35 | దామరాజు వెంకటేశ్వరరావుగారు, రిటైర్డు సూపరింటెండెంట్ ఆఫ్ పోలీసు | ,, | 100 |
| 36 | శ్రీ పి. వి. కృష్ణయ్యగారు, | ,, | 101 |
| 37 | రెబ్బాప్రగడ రామానందంగారు, ఐ. ఎల్. టి. డి. బ్రాంచి మేనేజరు | ,, | 100 |
| 38 | గుంటుపల్లి వెంకటేశ్వరరావుగారు, అడ్వొకేట్, | ,, | 100 |
| 39 | సంకా పూర్ణచంద్రరావుగారు, | ,, | 100 |
| 40 | పి. యస్. జనార్దనరావుగారు భారత్ కేఫ్ | ,, | 100 |
| 41 | కె. బసివిరెడ్డిగారు, అడ్వొకేట్, | ,, | 100 |
| 42 | కస్తల హనుమంతరావుగారు, యమ్.ఏ.బి.యిడి., ప్రిన్సిపాల్, ఎయిర్‌ఫోర్స్ స్పెషల్ స్కూల్, | ,, | 100 |
| 43 | గుడివాడ వెంకటలక్ష్మీనారాయణగారు, మర్చంట్సు | ,, | 100 |
| 44 | పులిపాక సూర్యప్రకాశరావుగారు, కరణం, | అమృతలూరు | 100 |
| 45 | యం. యల్. యన్. నారాయణరావుగారు, | భట్టిప్రోలు | 100 |
| 46 | గర్రె సత్యనారాయణగుప్తగారు, ఎల్. ఐ.సి. అసిస్టెంటు బ్రాంచి మేనేజరు, | విజయవాడ | 100 |
| 47 | జగర్లపూడి వెంకటేశ్వర్లుగారు | ,, | 100 |
| 48 | బట్రెడ్డి తమ్మేశ్వరరావుగారు, వైర్‌లెస్ ఇన్‌స్పెక్టర్ | , | 100 |
| 49 | బొడ్డపాటి సత్యనారాయణగారు, బి ఏ., | ,, | 100 |
| 50 | మల్లాది వెంకటకుటుంబరావుగారు, పేపరు మర్చంట్సు | ,, | 100 |
| 51 | పద్మనాభుని జోగీశ్వరరావుగారు, అడ్వొకేట్, | ,, | 100 |
| 52 | గుండా వెంకటరత్నం అండ్ సన్స్, క్లాత్ మర్చంట్సు | ,, | 111 |
| 53 | పాతూరి సూర్యనారాయణమూర్తిగారు, సూపర్వైజరు | ,, | 100 |
| 54 | నందిపాటి రామయ్యగారు. | ,, | 101 |
| 55 | కాశేపల్లి వెంకటనారాయణరావుగారు, | ,, | 100 |

| | | | |
|---|---|---|---|
| 56 | శ్రీ గుండా కృష్ణమూర్తిగారు, | విజయవాడ రు. | 100 |
| 57 | డాక్టరు పిళ్ళా వెంకటేశ్వరరావుగారు, | ,, | 100 |
| 58 | పి. సీతారామమ్మగారు, | నూజివీడు | 100 |
| 59 | వేంకటేశ్వరస్వామివారి దేవస్థానము, | బందరు | 116 |
| 60 | వల్లూరి వెంకట సూర్యనారాయణగారు, అడ్వొకేట్ | ,, | 100 |
| 61 | యద్దనపూడి రామచంద్రరావుగారు | ,, | 100 |
| 62 | తాడంకి వెంకట కృష్ణారావుగారు, అడ్వొకేట్ | ,, | 100 |
| 63 | మోటమర్రి దయానిధిగారు, | ,, | 100 |
| 64 | తాడికొండ నాగేంద్రరావుగుప్తగారు, మెడకల్‌షాపు | ,, | 100 |
| 65 | చిత్రపు అచ్యుతరామయ్యగారు, | ,, | 100 |
| 66 | దీవి సేతుమాధవాచార్యులుగారు, | ,, | 100 |
| 67 | శ్రీ అద్దేపల్లి వెంకటరామయ్యగారు, | ,, | 100 |
| 68 | పిన్నమనేని లింగయ్య చౌదరిగారు, అడ్వొకేట్ | ,, | 116 |
| 69 | వి. శ్రీరంగమూర్తిగారు, సి. టి. ఓ. | ,, | 100 |
| 70 | శ్రీమంతు రాజా యార్లగడ్డ విశాలాక్షమ్మగారు, | ,, | 100 |
| 71 | డా॥ కుప్పా వెంకటరామశాస్త్రిగారు, ఎం బి.,బి.ఎస్., | ,, | 100 |
| 72 | పిట్టి చెంచురామయ్యగారు. బి.ఎ , డి. సి. టి. ఒ | గుడివాడ | 100 |
| 73 | డా॥ జి. లక్ష్మణరావుగారు, యం.బి.,బి.ఎస్., | గుడ్లవల్లేరు | 100 |
| 74 | బొమ్మదేవర హేమలతాదేవి బహద్దరువారు, బి.ఏ. | ఏలూరు | 100 |
| 75 | బండి వీరరాఘవమ్మగారు, | చింతలపూడి | 100 |
| 76 | శ్రీ వేంకటేశ్వరస్వామివారి దేవస్థానము, | ద్వారకాతిరుమల | 100 |
| 77 | మావులేటి సోమరాజుగారు, | గుండుగొలను | 100 |
| 78 | దుర్గంపూడి ధర్మరాజుగారు, | ,, | 100 |
| 79 | మంచిరాజు చిన వెంకటరత్నంగారు, | భీమడోలు | 100 |
| 80 | తమ్మల వెంకటేశ్వరరావుగారు, | ,, | 100 |
| 81 | ముళ్ళపూడి తిమ్మరాజుగారు, | తణుకు | 116 |
| 82 | వి, సుబ్బరామారావుగారు, జి. యం. వి. సి. పశువులడాక్టర్ | ,, | 100 |
| 83 | బండారు బాపారావుగారు, | తాడేపల్లిగూడెం | 100 |

84 శ్రీ భీమవరం వర్తకసంఘ భవన గ్రంథాలయము.
భీమవరం రు 100

85 విశుద్ధానంద సరస్వతీ స్వాములవారు,
శ్రీ సత్యనికేతన్, దిమసుమర్రు 100

86 దంతులూరు రాధాకృష్ణరాజుగారు, మొగలపల్లి 100

87 ఇమ్మిడి సత్యనారాయణగారు, కమీషన్ మర్చంట్సు, పాలకొల్లు 100

88 బొండాడ వెంకటరాజుగుప్తగారు, క్లాత్ మర్చంట్సు, , 100

89 రాజులపాటి వెంకటేశ్వర్లుగారు, ,, 100

90 అద్దేపల్లి సత్యనారాయణమూర్తిగారు, ఎం. ఎల్ ఏ. ,, 100

91 కలగ వెంకట సూర్య సత్య శంభుప్రసాద్‌గారు, ,, 100

92 బంగారు వెంకట సూర్యనారాయణరావుగారు,
ఐరన్ హార్డ్‌వేర్ అండ్ పెయింట్సు మర్చంట్సు ,, 100

93 శ్రీ ఆదూరి భాస్కరరావుగారు, నర్సాపురం, 100

94 మాతా నిరంజనానందగిరివారు, ఆత్మారామాశ్రమం, కొవ్వూరు 100

95 గోకవరపు జగన్మోహనరావుగారు, అంబాజీపేట 100

96 దశిక రామారావుగారు, ఎగ్జిక్యూటివ్ యింజనీరు, నవుడూరు 100

97 దశిక నరసింహారావుగారు, ,, 100

98 తుమ్మలపల్లి సత్యనారాయణమూర్తిగారు, పిప్పర 100

99 చిన్ని తరుణయ్యగారు, బి. ఇ., ఎ. ఎం. టి ఇ.,
అసిస్టెంటు ప్రొఫెసర్, ఇంజనీరింగ్ కాలేజి, కాకినాడ 100

100 చిట్టూరి రామకృష్ణమూర్తిగారు ,, 116

101 చిట్టూరి స్వాముగారు, మర్చంటు, ,, 100

102 పైడా వెంకటనారాయణగారు, ,, 100

103 వేదుల లక్ష్మీనరసింహమూర్తిగారు, , 100

104 కనుమూరు వెంకటరావుగారు, ,, 100

105 గండికోట మల్లిఖార్జునరావుగారు,
అసిస్టెంటు ప్రొఫెసర్, ఇంజనీరింగు కాలేజి , 100

106 సి. వివేకానందమూర్తిగారు, ఐ. ఏ. ఎస్. రిటైర్డు ,, 100

107 మాజేటి రంగయ్యగారు. ,, 100

108 శ్రీ మొసలికంటి తిరుమలరావుగారు, యం. పి. కాకినాడ 100
109 దంటు సత్యనారాయణగారు, ,, 101
110 ద్విభాష్యం అన్నపూర్ణయ్యగారు,
రిటైర్డు రీజినల్ ట్రాన్సుపోర్టు ఆఫీసరు ,, 100
111 గాలిదేవర సత్యనారాయణగారు,
ప్రొప్రయిటరు, భాస్కర సైకిల్‌స్టోర్సు, ద్రాక్షారామ 100
112 కరెడ్ల వెంకమ్మగారు, సామర్లకోట 100
113 పాలకుర్తి చినవీరరాజుగారు, ,, 100
114 కాళ్ళూరి సూర్యనారాయణగారు విశాఖపట్టణము 100
115 పులుసూరి సన్యాసిశెట్టిగారు, జనరల్ మర్చంట్సు ,, 100
116 డా॥ బెండపూడి పేరరాజుగారు, ఎం. బి., బి. ఎస్., ,, 100
117 పలుకూరి జగన్నాధరావుగారు, ,, 100
118 దేవులపల్లి కృష్ణమూర్తిగారు, బి. ఇ.,
లెక్చరర్ యూనివర్సిటీ ఇంజనీరింగు కాలేజి ,, 100
119 కర్పూరపు వెంకట అప్పారావుగారు, బి. ఇ., ఎం. ఎస్.,
ఎ. ఎం. ఐ., ఇ., ఎం. ఇ., ఎం. ఎ ఎస్., ఎం. ఇ.,
ప్రొఫెసర్, ఆంధ్రా యూనివర్సిటీ 100
120 అప్పన సూర్యనారాయణరావుగారు, ,, 100
121 పి. వేంకటరమణయ్యగారు, ఎం. ఏ., ఎల్. టి.,
ప్రిన్సిపాల్, విశాఖ ట్యుటోరియల్ కాలేజి ,, 100
122 వాడ్రేవు చలమయ్యగారు, ,, 100
123 పి. వి. రామారావుగారు, ,, 100
124 కె. సి. హెచ్. పాత్రుడుగారు, ,, 100
125 ఉద్దగిరి శ్రీరామమూర్తిగారు, కమీషన్ మర్చంటు, అనకాపల్లి 100
126 తీగెల సీతమ్మగారు, కొత్తవలస, విశాఖజిల్లా 100
127 మాటూరి లింగమూర్తి, క్లాత్ మర్చంట్సు, విజయనగరం 100
128 ఎలిశెట్టి వెంకటస్వామినాయుడుగారు రైల్వేకంట్రాక్టరు ,, 100
129 గ్రంధి వెంకటశేషయ్యగారు, ప్రొ॥ మోడరన్ స్టోర్సు ,, 100

130 ఆలపిల్లి పైడిశెట్టి అండ్ వెంకట్రాజు, పార్టనర్స్,
శ్రీవాసవీ అండ్ కో,, విజయనగరం 100

131 ఆర్యవైశ్య ఎసోసియేషన్, ,, 100

132 కలిగొట్ల సూర్యనారాయణగారు,
మున్సిపల్ ఛైర్మన్, భీమునిపట్టణం 100

133 శ్రీ ఏడిద సూర్యనారాయణమూర్తిగారు, ,, 100

134 పొట్టా వీరరాజుగారు, ,, 100

135 రాయపురెడ్డి అప్పారావుగారు, వైస్ ఛైర్మన్ ,, 100

136 ముదురుపాటి వీరరాజుగారు, శిర్లపాలెం 100

137 శారదా గ్రంథాలయము, ,, 100

138 మేఘాద్రి మహాలక్ష్మమ్మగారు, గజపతినగరం 100

139 అడక్కి వెం. కృష్ణహనుమంతరావుగారు శ్రీకాకుళం 100

140 మగటపల్లి నరసింహమూర్తిగారు, ,, 100

141 పుల్లెల సీతారామయ్యగారు, అడ్వొకేట్ ,, 100

142 కొత్తా రమణాజీరావుగారు, బొబ్బిలి 100

143 సోమన్న వరలక్ష్మిగారు, ,, 100

144 మక్కువ చిరంజీవిరావుగారు సాలూరు 100

145 చావలి సీతారామయ్యగారు, బి. ఇ.,
అగ్రికల్చరల్ ఇంజనీర్, హైదరాబాదు 100

146 బండి రామారావుగారు, ,, 100

147 గైనేడి వెంకట అప్పారావుగారు, ఎల్. యం. పి. ,, 100

148 విరమనేని గోపాలరావుగారు,
డిప్యూటీ డైరెక్టర్, సివిల్ సప్లయిస్ ,, 100

149 పి. యస్. వారణాసిగారు
రిటైర్డు అసిస్టెంటు స్టేట్ కమీషనర్ ,, 100

150 యన్. వేణుగోపాలరావుగారు,
రిపోర్టర్, లెజిస్లేచర్ సెక్రటేరియట్ ,, 100

151 కనకదండి భాస్కరరావుగారు, బి. ఎస్‌సి.,
ఇన్‌కంటాక్సు ఆఫీసరు ,, 100

152 నిట్టల భీమశంకరరంగారు, రిటైర్డు ఇన్‌కంటాక్సు ఆఫీసరు , 100

153 యద్దనపూడి రామబ్రహ్మంగారు, ,, 100

154 కంచర్ల భూషణంగారు, బి. యస్. సి.,
డిప్యూటీ డైరెక్టర్ ఆఫ్ అగ్రికల్చర్ ,, 100

155 సి. వసంత శేషాద్రిగారు, ,, 100

156 కె. హనుమంతరెడ్డిగారు, డిస్ట్రిక్టు రేంజి ఆఫీసర్, సోనాల 100

157 సంగునూరు మహబూబురెడ్డిగారు, దేశముఖ్, వరంగల్ 100

158 రావేటి దత్త గణేశ్వర సిద్ధాంతిగారు
అధ్యక్షులు. ఆధ్యాత్మిక సేవాసంఘం, సిరిపురం, నల్గొండజిల్లా 100

159 శ్రీ యస్. జయరాంగారు, కుబేర్, ఆదిలాబాద్ జిల్లా 100

160 మహమ్మదు రహింతుల్లాగారు ఎం. ఎల్. ఏ.
మున్సిపల్ ఛైర్మన్. కడప 100

161 రామకృష్ణ సమాజ గ్రంథాలయము, ,, 100

162 రావూరు రంగనాధంగారు, అడ్వకేట్ ,, 100

163 శ్రీ రామకృష్ణానందస్వాములవారు,
శ్రీ భూమానందాశ్రమం, గండిక్షేత్రం 100

164 రాజా పోలేపల్లి వెంగన్నశ్రేష్ఠిగారు. వల్లూరు 100

165 ముత్యాల లక్ష్మయ్యశెట్టి అండ్ సన్స్,
కమీషన్ అండ్ జనరల్ మర్చంట్సు తిమ్మనచర్ల 100

166 జూటూరు దానప్ప అండ్ సన్స్ జనరల్ మర్చంట్సు ,, 100

167 యస్ నాగప్పగారు, స్కిన్ మర్చంట్సు. ,, 100

168 కె. వి లక్ష్మయ్యశెట్టిగారు, జనరల్ మర్చంట్సు, ,, 100

169 ఎన్. ఎం. నాగప్ప అండ్ సన్స్, టింబర్ మర్చంట్సు, ,, 100

170 టి. ఎం. పి. నాగప్ప అండ్ బ్రదర్స్,
నాగేశ్వర టింబర్ డిపో, ,, 100

171 యస్. కొమరప్ప అండ్ సన్స్, బ్యాంకర్స్ బళ్ళారి 100

172 కె. లక్ష్మీపతి అండ్ సన్స్. కమీషన్ మర్చంట్సు ,, 105

173 కె. సన్నఓంకారప్పగారు మర్చంట్సు, ,, 101

174 ఐ. వేంకటరత్నంనాయుడుగారు, ఎల్. ఎం. పి. ,, 100

175 జయంతి రుద్రయ్యశెట్టిగారు, బ్యాంకర్స్, రాయదుర్గం 100
176 చింతనూరు నాగప్పశెట్టిగారు, ,, 100
177 తల్లం హనుమంతప్పశెట్టిగారు, కమీషన్ మర్చంట్సు ,, 100
178 టి. రాజశేఖరరెడ్డిగారు, అలంపురం 100
179 గీతా సేవాసమితి, కళ్యాణదుర్గం 100
180 మలుగూరు సంజీవప్పగారు కనగానపల్లి 100
181 నాయని మునిరత్నంగారు, బస్సు ప్రొ॥ అనంతపురం 116
182 టి. పట్టాభిరాములుగారు, ప్రొ॥ కంబైండ్ ఆటో సర్వీసు ,, 116
183 కమతం కుమారస్వామిగారు,
రిటైర్డు డిస్ట్రిక్టు ప్రొహిబిషన్ ఆఫీసరు ,, 116
184 పి. లక్ష్మినారాయణరెడ్డిగారు, అడ్వొకేట్, ,, 116
185 గల్లా పుల్లయ్యగారు, శ్రీ వెంకటేశ్వర మోటారు సర్వీసు, ,, 116
186 కోప్పూరు గంగప్పశెట్టిగారు, శ్రీ వేంకటేశ్వర ఐరన్‌మార్ట్ ,, 116
187 కె. ఉన్ని కృష్ణన్‌గారు కృష్ణా ఆటోమోబైల్స్, అనంతంపురం 116
188 వై. కొండారెడ్డిగారు, కంట్రాక్టర్స్, ,, 116
189 టి. వి. అశ్వర్థనారాయణగారు, జ్యూయలర్, ,, 116
190 ఎన్. వెంకటస్వామిగారు, కంట్రాక్టర్స్, ,, 116
191 వై. ఆంజనేయులుగారు, బి. ఏ., బి. ఇ., ఎం.ఎస్‌సి.,
గవర్నమెంటు ఇంజనీరింగ్ కాలేజి ,, 116
192 పి. పి. సుబ్బారాయుడుగారు, ఇన్‌స్పెక్టర్ ఆఫ్ పోస్టాఫీసు ,, 116
193 కమతం కుళ్ళాయప్పగారు, రేడియో ఇంజనీరింగువర్క్సు, ,, 116
194 గంటి ఎ. శాస్త్రిగారు, ఎం. ఎస్‌సి పిహెచ్ డి.,
ప్రిన్సిపాల్, వెటర్నరి కాలేజి తిరుపతి 100
195 డా॥ వి. సుశీలాబాయిగారు ఎం. డి. డి. జి. ఒ., తిరుపతి 100
196 కలపటపు భాస్కరరావుగారు, సంస్కృత లెక్చరర్, తిరుపతి 100
197 పి. వి రమణయ్యగారు, (రాజా) కమీషన్ మర్చంటు, మద్రాసు 100
198 ఎ. ఎం ఓబలాపతిశ్రేష్టిగారు, బి.కాం. బి.ఎల్ ,ఎఫ్.ఎన్.ఎ.ఎ.
ఇన్‌కంటాక్సు ప్రాక్టిషనర్, అడ్వొకేటు, మద్రాసు 100
199 ఎం. చాలచంద్రుడుగారు అడ్వొకేటు మద్రాసు 100

200 జక్కా సూర్యారావుగారు, జంషెడ్‌పూర్ 100

201 బి. బి. సుబ్రహ్మణ్యంగారు కేషియర్,
స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా, భీమునిపట్నం 100

202 కె. ఎ. రామరాజుగారు, ఆల్ ఇండియా రేడియో, విశాఖపట్నం 100

203 డా॥ కె. యస్. యన్. రావుగారు, టి. బి. స్పెషలిస్టు
విజయవాడ 100

204 బి. ఓ. యస్. యన్. కె. లింగంగారు, మొగల్తూరు 100

205 ఆమూరి కాశీవిశ్వనాధశర్మగారు, కేషియర్
స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా బాపట్ల 100

206 బొద్దన వైకుంఠంగారు, బొంబాయి 100

207 యం. బుచ్చయ్యగారు, బొంబాయి 100

208 జి. సుబ్రహ్మణ్యంగారు, రిటైర్డు అసిస్టెంట్ ఇంజనీర్
(ఎలక్ట్రికల్) మదనపల్లి 100

1 శ్రీ ఎలిశెట్టి సుబ్బారాయుడుగారు గోల్డుమర్చంట్సు నెల్లూరు 58

2 పసుపర్తి సుబ్బరాజుగారు, జి. డి. ఎ. ఎఫ్. జి. ఏ.
మేనేజరు, ఎల్. ఐ. సి. బొంబాయి 50

3 కొండ ఈశ్వరరాజుగారు, గుండుగొలను 50

4 ఉనికిలి వెంకటరాజుగారు, గుండుగొలను 50

5 నుదురుపాటి సత్యనారాయణగారు, భీమునిపట్నము 50

6 పూసర్ల జి. అప్పలనరసయ్యగారు,
టింబర్ మర్చంట్సు, విజయనగరం 50

7 తాయి మల్లికార్జునప్పగారు, రాయదుర్గం 50

8 పోలా చిన్నంనాయుడుగారు, మల్లంపేట, శ్రీకాకుళం జిల్లా 50

# వి ష య సూ చి క



# ద్వితీయ ముద్రణము

ఈ 'శాంతిసామ్రాజ్యము' అను గ్రంథము పరమహంస పరివ్రాజకాచార్యవర్యులైన శ్రీ శ్రీ శ్రీ అనుభవానంద స్వాములవారిచే రచింపబడినది. ఇది శ్రీ అనుభవానంద గ్రంథమాలయందు 1956 వ సంవత్సరములో పండ్రెండవ కుసుమముగ అచ్చొత్తింపబడినది సుమారు 4, 5 సంవత్సరములనుండి దీనిని అచ్చువేయవలెనని సంకల్పించినను శ్రీస్వాములవారి అనారోగ్యకారణమున అచ్చువేయించలేదు. మరల నేడీ గ్రంథము ద్వితీయ ముద్రణమునకువచ్చుట భగవదనుగ్రహ విశేషము.

శాంతి వ్యష్టిగతము.అందుచేత యీ శాంతిని కాంక్షించు మానవుడు తీవ్రవైరాగ్యయుతుడై ప్రాపంచిక విషయ సంస్కారదూరుడై, యమనియమాద్యనుష్ఠానశీలుడై, తపస్సంపన్నుడై. జితేంద్రియుడైనచో శాంతిసామ్రాజ్యమునకు అధిపతి కాగలడు. ఈ వ్యష్టిగత శాంతిని ప్రపంచమునకు ప్రసాదించుటకు శాంతిదాత ఎంతయో కృషిసల్పును. లోకమున నందరు శాంతిని పొందకున్నను ఆ వ్యక్తుల పవిత్రదృష్టి, పవిత్ర భావములచే, పవిత్ర ఆశీస్సులచే కొంతమందియైనను శాంతి సౌభాగ్యముల నున్నియుండగలరు. అట్టి పరమ సుఖదమై, అమృతమయమై ఆనందదాయకమై అజరామరమైన శాంతిని పొందు విధానము యీ గ్రంథమున వివరింపబడినది.

శ్రీ శ్రీ శ్రీ అనుభవానందస్వాములవారు అనేక గ్రంథములను రచియించి. మన భారతీయ సంస్కృతీ ప్రాశస్త్యమును దేశ దేశముల ప్రచారము సల్పిన మహనీయమూర్తి నాకు గురుపుంగవులు. శ్రీవారు శ్రీ రామకృష్ణ పరమహంస

దేవుని అనుసరించిన సర్వసమన్వయమూర్తి. శ్రీ స్వాముల వారు 1973వ సంవత్సరము మే నెల 17-5-73 వ తేది అనగా వైశాఖ శుద్ధ పూర్ణిమనాడు తమ భౌతికదేహమును వదలిరి.

శ్రీ స్వాములవారి అనుగ్రహవిశేషముచే శ్రీ అనుభవానంద గ్రంథమాల యథారీతిగ తన కర్తవ్యమును తాను నిర్వహించుచున్నది. 1974, 1975 లలో మరల ఆరు పుస్తకములను పునర్ముద్రణము చేయించినది. ఇంకను కొన్ని పునర్ముద్రణమునకు సిద్ధముగా నున్నవి.

ఈ 'శాంతిసామ్రాజ్యము' మరల ప్రపంచమున ప్రచారమునకు బయలుదేరుచున్నది. పాఠకులు శాంతికాముకులై శాంతిని బొంది, అశాంతిని పారద్రోలి, ప్రపంచమునకు ప్రశాంతిని ప్రసాదించుదురుగాక! అందులకై దైవానుగ్రహము కలుగుగాక! మహాత్ముల ఆశీర్వాదములు మనకు ఫలించుగాక!

బాపట్ల | ఇట్లు,
1-12-75 | మాతాజీ త్యాగీశానందపురి

ఓం

# శాంతి సామ్రాజ్యము



## శాంతి—అధికారి

శ్లో॥ విహాయ కామాన్యస్సర్వాన్ పుమాంశ్చరతి నిఃస్పృహః।
నిర్మమో నిరహంకారః స శాంతి మధిగచ్ఛతి॥

ఏపురుషుడు సర్వకామముల వర్జించి విషయాసక్తియు, నహంకార మమకారములును లేనివాడై సంచరించుచున్నాడో, అట్టివాడు శాంతిని బొందుచున్నాడనియు, "స శాంతి మాప్నోతి న కామ కామీ" విషయాపేక్షగలవాడు శాంతిని బొందజాలడనియు, సర్వానర్థదాయక విధ్వంసక ప్రకృతులచే నావరింపబడి, సంక్షుభితమై, సర్వజీవరాసుల హృదయాంత రాళములద్వారా శాంతి నాకాంక్షించుచు, దత్ప్రదాతకొరకై అనుక్షణ నిరీక్షణమున దినముల లెక్కించు నాధునిక ప్రపంచ మును సంబోధించి శ్రీకృష్ణభగవాను డుపదేశించిన మహా వాక్యము లివి. వ్యష్టి సమష్టు లొక్కటే యనియు, వ్యష్టి బహుళత్వమే సమష్టి యనియు, గాన సమష్టి శ్రేయమే వ్యష్టి క్షేమమనియు, సమష్టి కన్యముగ వ్యష్టి క్షేమము లేదనియు గ్రహింపజాలక, విషయతృష్ణాబద్ధులై, సమష్టిరూప సంఘ క్షేమమును బాటింపని స్వార్థపరుల నుద్దేశించి భగవాను డా మహోపదేశము గావించెను.

# ధర్మ ప్రవృత్తి

ఈ విపరీత పరిణామమును భవిష్యత్కాలమున నుప లక్షించియే, సృష్టికి బూర్వమునగల బ్రహ్మము మానవ కోటిని సృజించి, వాని యోగక్షేమపాలకత్వము క్షత్రియా ధీనము గావించియు, నా పాలకులు నియంతలై సంఘమును హింసింతురని వ్యధచెందినవాడై వారి గట్టుదిట్టముల నుంప "తచ్ఛ్రేయోరూప మత్యసృజత ధర్మం" శ్రేయోరూపమైన ధర్మమును సృజించెను. అందుచే నా ధర్మమునకు "తస్మా ద్ధర్మాత్పరం నాస్తి" మించిన శ్రేయము గాంచమని బృహదా రణ్యకోపనిషత్తు బోధించుచున్నది. అహింసాసత్యాస్తేయ బ్రహ్మచర్యాఽపరిగ్రహాది యమరూప వివిధబాహ్యాప్రపంచ పవిత్ర సంబంధములలో గాలాంతరమున బ్రాధాన్యతను వహింపనలసిన సత్యమునే అచట ధర్మమున కన్వయము గావించియున్నను "వాగ్వై బ్రహ్మేతి" అను శ్రుతివాక్యసరణి వాక్కే సర్వప్రవృత్తుల కాధారమై యుండి సాక్షాద్బ్రహ్మమే యగుటచే నద్దాని పవిత్రముగా నుంచుకొనిన సర్వేతరప్రవృ త్తులు పవిత్రవర్తనమున నుండు రహస్యమును గుర్తించి శ్రుతి యీ రీతి బోధించియున్నది. అందుచేతనే 'ధర్మ' శబ్ద మా యర్థము నధిగమించి నైతిక జీవితవిధానమున కన్వయమగుచు "యతోఽభ్యుదయ నిఃశ్రేయససిద్ధిః స ధర్మః" అను వైశేషిక దర్శన సూక్తివిధమున స్వర్గాపవర్గరూప పరమపురుషార్థ సాధనత్వమే స్వీయ లక్ష్యముగ నుంచి, నిత్యజీవితపారిశుద్ధ్యమే ధర్మముగా బరిణమింపజేసి, లోకోపకారియై చెల్వొందు

చున్నది. అద్దాని నాశ్రయించియే యసంఖ్యాక ధర్మ శాస్త్రము లుద్భవించి, ధర్మకీర్తనము గావించి, యనాది కాలమునుండి లోకమునకు శ్రేయోసిద్ధిని జూపించి, సర్వ క్షేమమునకు మార్గదర్శకములై రాజిల్లినవి.

## ధర్మ శిక్షణ

కాని యీ ధార్మిక దృష్టి నార్జించుటకు వివిధ సమస్యలతో నిండి నిబిడీకృతమైన రాజకీయ వాతావరణముకాక విద్యావ్యాసంగముల బ్రోత్సహించు ప్రశాంత వాతావరణ మావశ్యకము. ఇంక నాధునిక భౌతిక విజ్ఞాన ఫలితములగు అసంఖ్యాక విషయేంద్రియ సుఖావిష్ట పట్టణములును, సంతత కృత్రిమ శబ్దాకీర్ణమై యనారోగ్యకర ధూమప్రావృతమై యుండు కర్మాగార ప్రదేశములును గాక; ఆనందోత్సాహ దాయకమై స్వాభావికమై వివిధ పక్షిగణముల కిలకిలారవ ములతోడను, సుస్వాభావిక తేజమున, ప్రకృతిమతల్లి యంక తలమున నభివృద్ధిగాంచుచు నీశ్వరవిలాసమును బ్రత్యక్షము సేయు నారామ, గ్రామ, అరణ్య క్షేత్రములే ప్రశాంత విద్యాసాధనల కత్యంతోపయుక్తములు. అంతియగాక "శ్రోత్రియం బ్రహ్మనిష్ఠం" అను శ్రుతి రీతి శాస్త్రజ్ఞానియు, నాత్మరతుడు నగు యాదర్శమైన నాచార్యసన్నిధానమున గాని ధార్మిక జీవన శిక్షణము ప్రాప్తించదు. అనగా సద్విద్యా విధానమునగాని ధర్మశిక్షణము సాధ్యముగాదు. నిరంతర మాచార్యసన్నిధానభాగ్యమున, నాదర్శమగు ఆచార్య పవిత్ర వాతావరణముచే ప్రోత్సహింపబడి, శ్రవణానుష్ఠానములు

(Theory and Practice) సుశిక్షితులగు విద్యార్థుల జెంపొందింపకల్గుటయే, ఆర్ష విద్యావిధాన ముఖ్యోద్దేశము. అదియే గురుకులాశ్రమ కార్యక్రమము. కేవల విద్యాభ్యాసము నేగాక సాంఘిక జీవనమున కాధారభూతమగు ధార్మిక సూత్రావలంబకులకు శిక్షణము నొసంగు శిక్షణాలయము లగుటచే «విద్యార్థీ చేత్ త్యజేత్ సుఖం” అనునటుల సుఖ లాలసత్వమును ద్యజించి, విద్యార్థ దృష్టినుంచుటచే నా సంస్థలు బ్రహ్మచర్యాశ్రమములనియు గీర్తిగాంచినవి. «బ్రహ్మ” శబ్దము వేదమున కన్వయించుటయేగాక సర్వసృష్టికాధార భూతమగు బ్రహ్మపదార్థ మగుటచే గురుకులవాసి కేవలము లౌకిక విద్యార్థమేకాక బ్రహ్మానుభూతి కవసరమగు యోగ్య తనుగూడ నార్జించు దృక్పథమున నందు వర్తించుటయు ముఖ్యముగా గాంచనగును. కాన నా విద్యార్థి దృష్టి స్వార్థ విషయాసక్తమగు ప్రపంచ వాసనల నతీతించి, నిస్స్వార్థమై, సమష్టిరూప సంఘ శ్రేయో కాంక్షితమై «ఆత్మనో మోక్షార్థం జగద్ధితాయ చ” అను నార్యోక్తి చందము స్వపర క్షేమం కర మార్గగామియై యొప్పారుచుండును.

## ధర్మాంగములు

నిస్స్వార్థమై, యలౌకికాధ్యాత్మికానంద సంశోభిత వాతావరణమున జెల్వొందు నా గురుకుల సద్విద్యాసదన ములు «సమ్యక్ ప్రశాంత చిత్తాయ శమాన్వితాయ” “శాంతో దాంత ఉపరతి స్తితిక్షుః శ్రద్ధా సమాహితః” అను శ్రుతివచనములరీతి నధికారులగు విద్యార్థు లేతెంచుచో

వేదాధ్యయనాది బ్రహ్మవిద్యాభ్యాసములనేగాక, సాంఘిక జీవితవికాసమునకు దోడ్పడు వేదాంగము లనబడు శిక్షా, ఛందస్, వ్యాకరణ, నిరుక్త, జ్యోతిష, కల్పాది లౌకికవిద్యల గూడ వారికి బోధించి ఆదర్శగృహస్థుల జేయ యత్నించును. పూర్వోక్త సాధనసంపత్తిరహిత చిత్తులే యరుదెంచుచో నట్టివారి కా యర్హతలయందు శిక్షణ యొసంగి, పై విద్యా విషయముల ప్రవీణుల గావించుచుండుట బరిపాటి. అందుచే సంఘజీవన మారోగ్యవంతముగ నభివృద్ధిగాంచుటకు కేవ లము విద్యయే ఆధారముగాక దాని కధిష్ఠానముగ విద్యార్థుల ధార్మికప్రవృత్తియు ముఖ్యముగ నుండవలెనని గురుకుల విద్యావిధాన రహస్యము.

బ్రహ్మనిష్ఠారతులై యహంకార మమకార వర్జితులై తమ సాధనజనితాధ్యాత్మికానుభవ విభూతిని సంఘ క్షేమము నకై ధారవోయ సంకల్పించి, సంసిద్ధులైన ఆ యాచార్యుల దృష్టి యపరవిద్య లనబరగు లౌకిక విద్యాదులపై నమాత్రము కేంద్రీకరింపబడియుండక, ననగాభౌతిక, మానసిక, ఆధ్యాత్మిక ములలో భౌతిక మానసికాభివృద్ధికే యత్నింపక నా రెండిం టికి బునాది యగుటచే నా ద్వయమునకు శక్తినొసంగు ఆధ్యా త్మిక పరిస్థితికిని ప్రాధాన్యత నొసంగి, తదాధారమగు అష్టాంగ యోగ రహస్యములనుగూడ నుపదేశించుచుండెడివారు. శరీ రము మనస్సుచేతను, మనస్సు బుద్ధిచేతను నడుపబడుటచే నాత్మకు సన్నిహితమగు బుద్ధి పవిత్రమైనచో క్రమన్యాయ మున మనోశరీరములును బవిత్రములై, సర్వశ్రేయోదాయక ములై ప్రవర్తించును. కాన నత్యంత ప్రధానమగు బుద్ధి

సుశిక్షితమై పవిత్రత నార్జింప యమ నియమములతో ప్రారంభించి సమాధ్యనుభూతితో బరిసమాప్తినొందు సాధనాసౌష్ఠవముపై దృష్టి నిలుపవలెను.

యోగసూత్రకారుడైన పతంజలి మహర్షి గొప్ప మానసిక ధర్మశాస్త్ర వేత్త యగుటచే మనోపరిణామ కార్యమున గల గష్టనిష్ఠురముల సాకల్యముగ బరిశీలించి సాధించి, ఆ యనుభవజనితానందఫలసముదాయమును క్రోడీకరించి, మనోజయ సిద్ధికి నుపయుక్త మహోపదేశముల యోగశాస్త్ర రూపమున నిర్మించి లోకమునకు బ్రసాదించెను. చిత్తవృత్తుల నిరోధించి వితర్క విచారానందాస్మితాది సంప్రజ్ఞాతముల ద్వారా నిర్మలము గావించి "సర్వనిరోధాన్నిర్బీజః సమాధిః" అనిర్వాచ్యమైయున్న అసంప్రజ్ఞాత సమాధిరూప ఆత్మానందమున మునిగియుండుటకేగాక యమనియమాది బాహ్యాంతరేంద్రియ నిగ్రహమున సంప్రాప్తమైన శమదమాది సాధన సంపత్తిచే బ్రశాంతచిత్తుడై, సర్వ శ్రేయోదాయక జీవితానుష్ఠానమున బరిసర మానవసంఘమునకు మహోత్కృష్టాదర్శమై, శాంతి ప్రదాతగ మానవుడు పరిణమించు విధానమునుగూడ నా శాస్త్రరాజ ముపదేశించుట మన మహాభాగ్యము. యమ నియమముల బ్రథమతః సాధించినగాని ఆత్మానందవిభూతి హస్తగతము కానేరదని ఆ మహర్షిచంద్రుడు బోధింప వాని కత్యంత ప్రాధాన్యత నొసంగియున్నాడు. వాని విషయము నొకించుక విచారించెదముగాక!

"అహింసా సత్యాస్తేయ బ్రహ్మచర్యాపరిగ్రహా యమాః" యని యోగసూత్రము. ఈ పంచ యమాంగముల

ప్రదికరణశుద్ధిగా ననగా మనోవాక్కాయకర్మణా యనుష్ఠింప వలయునని యాదేశము. అంతియగాక సర్వదా సర్వథా వాని నవలంబింపవలయు ననియు హితోక్తి. అహింసావ్రతము వేదకాలముననుగూడ పాటింపబడుచున్నను స్వార్థమున తన్ని యమ పాలనము లోపించుచు వచ్చినది. యుద్ధము, వేట, ఆహారము, యజ్ఞములయందు తదవలంబనము దూరమైయుండెడిది. కాని భగవాన్ బుద్ధదేవుని కాలమున నది తీవ్రరూపమును దాల్చి జాతి దేశ కాల సమయముల నతిక్రమించి, సర్వకాల సర్వావస్థల ననుష్ఠేయమై మహావ్రతమై ప్రకాశించియున్నది. గాంధీమహాత్ముని కాలమున నహింసము సత్యాహింసలు మహోన్నతపదవి నాక్రమించి సాంఘికమునమాత్రముగాక, రాజకీయ రంగములగూడ నధిష్ఠించి, సర్వప్రపంచమున కాదర్శమై యొప్పారుట లోకవిదితము. ఇద్దాని ఫలితముగ "అహింసా ప్రతిష్ఠాయాం తత్సన్నిధౌ వైరత్యాగః" అను సూత్రమురీతి నహింసాప్రతిష్ఠితునికి వైరము లేకుండుటయే గాక నతనిపై నెల్లరకు వైర మభావమగుచున్నది. అంతియు గాక నట్టి పవిత్ర సన్నిధానమున సర్వజీవరాసులును తమ పరస్పరవైరముల బరిత్యజించి స్నేహభావమున వర్తించును. ప్రాచీనకాలమున ఋష్యాశ్రమ పరిసరములు సర్వజీవరాసుల కాకరమై సమరసవృత్తుల నిండి యుండినట్లు విదితముగదా! అందుచేత బతంజలి మునివరుండు వ్యష్టి సమష్టుల యభివృద్ధికి నహింసావ్రతపాలనమే ప్రథమసోపానముగా బరిగణించి బోధించి యున్నాడనుట నిస్సందేహము.

"సత్యం యథార్థే వాఙ్మనసే" అనునట్లు యథా

దృష్టమో తథా వాఙ్మనములద్వారా వ్యక్తపరచుట సత్యమని వివరణము. అట్లు సత్యవాక్పరిపాలనమున "సర్వభూతహితం సత్యం" అని వచించుట కెక్కువ అవకాశము లేర్పడుచున్నవి. ఆ సత్యదీక్షయే లేకున్న శ్రీరామచంద్రు డరణ్యముల కేగుట జరిగియుండదు. అందుచే సర్వాదర్శ గ్రంథమగు శ్రీమద్రామాయణము ప్రపంచమున నభానమైయుండెడిది శ్రీరామరాజ్య మను ఆదర్శ రాజ్యాంగతంత్రము కేవలము శ్రీరామచంద్ర ప్రభువుయొక్క సత్యత్వముమీదనే ఆధారపడియుండుట సర్వ విదితము. కావున నహింసావ్రతమునకు దగు శక్తి సామర్థ్యముల నొసంగి, ఆదర్శ సంఘమును నెలకొల్ప సత్యము బహుముఖముల దోడ్పడుచున్నది. సంఘముపై దాని శక్తి యమోఘమని శాస్త్రవచనము

పై విధాన నేజీవికిని హాని కలుగజేయక దానిగూర్చి యసత్యము లాడకుండుటయేగాక దాని ద్రవ్యంబుల గాంక్షింపకుండుటయే అస్తేయపదార్థము. న్యాయబద్ధముగ నితరులకు గల వస్తు వాహన గృహ క్షేత్రాదిక ద్రవ్యముల నన్యాయముగ గాంక్షించి దాని నపహరించుటయు మాత్రమేకాక, నపహరింప నెంచుటయు స్తేయమనంబడును. మరియు నా ద్రవ్యమితరుల కన్యాయసంపాదితమై యున్నను, అన్యాయముగ నద్దాని గాంక్షించుటయు నన్యాయమై యొప్పారును. గాన నదియు స్తేయమే యగును. న్యాయార్జితములకై యత్నింపక నితరుల ద్రవ్యముల కాసించి, యత్నించి, పీడించి, హింసించి, అపహరించుటయు సంఘమునకు ప్రమాదకరము. ప్రపంచ శాంతికి భంగకరము. అందుచే నట్టి స్వార్థముతో కూడిన

స్తేయమును రూపుమాపుటయే ముఖ్య కర్తవ్యము. ఈ స్తేయము కేవల మపహరణమేగాక బలాత్కార గ్రహణముగ గూడ బరిణమించుచుండుట విదితము. ఇతరుల గంటబడక బరగ్రహణ మపహరణ మగుచున్నది. అట్టిది సాధ్యము కానిచో వస్తుచౌర్యమున కాటంకపరుల హింసించి, లేక హత్య గావించియైన వస్తుసేకరణ్ణముగూడ నపహరణమే యగును. కాన స్తేయము పరిమిత మగు ధన వస్తు వాహన గృహ క్షేత్రాదికములగు అవధుల నధిగమించి, రాజ్యసామ్రాజ్యము లనబడు అంతర్జాతీయములవరకేగాక నాధునిక ప్రపంచము నావరించియున్న గ్రహాంతరయానము లన్నిటిని స్తేయము తనయందంతర్గతము గావించెను, శాస్త్రపరిశీలనము గావించి యథార్థ విషయగ్రహణము అత్యావసరమైనను ఆక్రమణ మన్యాయము, అపహరణతుల్యము, కాన నదియు నిషేధమే యగుచున్నది. అట్లు మనో వాక్కాయరూప అస్తేయ పరిపాలనమున సర్వ సౌఖ్యములు లభించునని పతంజలి మహర్షి సత్తముని వాగ్దానము.

అస్తేయ మెట్లో అట్లే బ్రహ్మచర్యముగూడ మిగుల ప్రధానము. పరమపురుషార్థము లనబరగు ధర్మార్థ కామ మోక్షములలో నర్థకామముల ధర్మమోక్షములకై యంకితము సేయుటయే ముఖ్యము. అర్థకామములు మానవుని బ్రపంచ బద్ధునిగ జేసి విషయముల ముంచి నశింపజేయ, ధర్మమోక్షము లతని బరిశుద్ధుని గావించి ప్రపంచాతీతునిగ నొనరించుచు సర్వ విషయ విముక్తునిగ జేయును. అర్థకామములు సంఘమున వైషమ్యముల సృజించి యశాంతి ప్రజ్వలింపజేయ, ధర్మ మోక్షములు సర్వప్రశాంతి బ్రసాదించును. కాన నర్థమును

న్వేషయ సూత్రమున నియమించినచో సంఘమున ననర్థ మర్థ మదృశ్యమగును. ఇక గామరూప కామినీజయముచే బూర్తి శాంతి జగమున బ్రతిష్ఠితమగును. లోకమున బోరాటములు కామినీకాంచనముల నాశ్రయించియే జరుగుచుండుట లోక విదితము. అందుచేతనే మానవుని బంధించు పాశత్రయములో ధనేషణ దారేషణల శాస్త్రములు చేర్చియున్నవి. అట్టి బలీయమైన ధనేషణాజయము గావించి దారేషణపై దృష్టిని బ్రసరింపజేయుట ముఖ్యము. అదియు స్వాధీనమైనగాని ఆత్మశాంతియు లోకశాంతియు సంప్రాప్తింపనేరవు. అన్యాయముగ సామ్రాజ్యముల కాసించి, దుర్యోధను డతి ఘోరమైన భారత మహాయుద్ధమునకు గారకుడై ప్రపంచప్రళయమును గల్పించెనుగదా! అటులే కామినీలోలత్వముచే రావణుడు మహారణమును బురికొల్పి వంశనాశనము నొందియున్నాడు. అందుచేతనే హిందూ ధర్మపాలనములో నీ రెండు విషయము లతిప్రాధాన్యత వహించి, ఆ గ్రంథద్వయమును హిందూ సంఘమున సదా పారాయణయోగ్యము గావించి యున్నవి. కావున గామజయమునకై ఆబాల్యము బ్రహ్మచర్యవ్రత దీక్ష అవసరమై యున్నది. అట్టిదానికై "సత్సంగత్వే నిస్సంగత్వమ్ నిస్సంగత్వే నిర్మోహత్వమ్ నిర్మోహత్వే నిశ్చలతత్వం" అను నాచార్యోక్తి ననుసరించి జితేంద్రియులును ఆదర్శనీయులగు ఆచార్యుల సన్నిధానమున బ్రహ్మచర్యవ్రతము సుప్రతిష్ఠితమగును. 'గుప్తేంద్రియస్యోపస్థస్య సంయమః' అని విస్పష్టలీల బ్రహ్మచర్య పద వివరణము వ్యాసభగవానులు గావించియున్నారు. అష్టవర్ష ప్రాయమున నుపనయనసంస్కా-

రాదిగా సద్గురు సన్నిధానమున నంతేవాసియై మనుమ నాత్మో
ద్ధారకమగు ఆపవిత్రోత్తేజకర వాతావరణమునను కలిడుచు
"బ్రహ్మవిద్యయా సర్వం భవిష్యంతః" అను శ్రుతిరీతి బ్రహ్మ
విద్యాధ్యయనమును గమ్యముగా గలిగి తదంగములగు లౌకిక
విద్యలఁగూడ బఠించుచు నలౌకిక పరిసరముల నున్న ఆవిద్యా
ర్థికి కామ్యములే లేకుండ నిక స్త్రీవ్యామోహము లెట్లావరిం
చును? యౌవనమున బాహ్య దృశ్యములచే నాకర్షింపబడి,
చిత్త చాంచల్యమున బహిర్గతమై, అక్రమ పద్ధతుల బ్రసరించి
భ్రష్టత నొందు యింద్రియ ప్రవృత్తులు అతీతాధ్యాత్మిక
వాతావరణమున భ్రష్టత కవకాశములులేకయు, మీదు
మిక్కిలి ఆదర్శ సాంగత్య మహిమచేతను సంయమనము
గావింపబడి కాలక్రమమున నవవసర బాహ్య ప్రవృత్తినొందు
నసమర్థతను బాసి శక్తివంతములై, విద్యాసాధనాభివృద్ధికి
దోహదములై చెలువొందును. అందుచే గనీసము ద్వాదశవర్ష
ములు గురుకులవాసభాగ్యము నొందిన బ్రహ్మచారి ఇంద్రియ
నిగ్రహకార్య ధురంధరుడై, శాంతిసంధాతయై, సంఘోద్ధరణ
మూలసూత్రముగా బ్రకాశించును. అతడు సర్వదాశక్తిమంతు
డనుటకు "బ్రహ్మచర్య ప్రతిష్ఠాయాం వీర్యలాభః" అనివిదులు
సూత్రీకరించియున్నారు. అట్టివాడాదర్శవంతుడగుటచే నితరు
లకు "జ్ఞానమాధాతుం సమర్థో భవతి" అనురీతి జ్ఞాన ముప
దేశించుటకుగూడ సమర్థుడగుచున్నాడు. కాన నట్టి బ్రహ్మ
చర్యదీక్షాదక్షులే సకల నాచార్య పీఠము నలంకరించి, సంఘ
క్షేమంకర బోధ గావింప నర్హులగుచున్నారు. వారి వాక్యము
లమోఘ శక్తియుక్తములై, అజేయములై, తక్షణానుసరణీయ

ములె రాజిల్లునని శాస్త్రవాక్యములేగాక విద్వదనుభవము
కూడ సమర్థించుచున్నది.

సంఘమున కట్టి యమూల్యాదర్శమును ప్రసాదించిన
వాడు అపరిగ్రహదీక్షాపరుడై యుండుననుట కెట్టి సందియ
మును లేదు. కాని పరిగ్రహణమున గల సర్వానర్థ దోషముల
నెట్టెదుట నుంచి, దాని దూరీకృత మొనర్ప నుత్సాహము
కలుగజేయు నుద్దేశమున నపరిగ్రహమును గూడ శాస్త్ర
కారులు యమమున బంచమాంగముగ జేర్చిరి అనవసర
ముల నితరులనుండి అన్యాయముగ గైకొనకుండుటయే గాక
నవసరములగూడ స్వీకరింపకుండుటయే యిందలి తాత్పర్యము.
పరిగ్రహణ మేవిధానముననున్నను సంఘమున నిర్వర్తింప
వలసిన విధ్యుక్తకార్య నిర్వహణమున కది ఆటంకదాయకమై
క్రమముగ నాశను బ్రేరేపించి పూర్వార్జిత సర్వ సద్గుణముల
నాశపరుప నొక మహా దుష్ట శక్తియై పరిణమించును. కాన నిది
పూర్వవర్ణిత చతుష్టయముకంటె బలీయము కాన పంచమ
స్థానము నొందియున్నది పరిగ్రహణకార్యము చిన్న చిన్న
వస్తువులతో ప్రారంభించి, క్రమముగ విజృంభించి, దేశ
ద్రోహకరముగ బరిణమించి సంఘమును బాధించుచుండుట
ప్రస్తుత కాలమున వ్యక్తముగదా! అదియు విద్యను విక్రయిం
చని, ఎవ్విధినైన ధనము నపేక్షింపని గురువర్యుల పాద
పద్మముల చెంత శిక్షణము నొందినవారికే అది లభ్యము కాని
యితరులకు అసాధ్యము. ఆ యపరిగ్రహవ్రత వీరులుసంఘము
నకు మహాభాగ్యము. అట్టివాడు గల దేశము అదృష్టదేవత.
పై లక్షణములుగలవారు పదిమంది రాజ్యతంత్రమున నధి

ష్ఠాతలై యున్నచో ప్రపంచరూపము సంపూర్తిగ మారి పోవును.

ఇంతదనుక జర్చించిన యమ పాలనము సంఘ శాంతికి దోహదమునదై ప్రపంచమున సర్వజీవులతో నిస్స్వార్థమైనపవిత్ర సంబంధమునే ప్రోత్సహించి, శాంతి సౌఖ్యముల బ్రసాదించి పరదేవతామూర్తివలె రూపొందియుండును. కాని శాంతి సామ్రాజ్యస్థాపనమున కది యొక్కటియే చాలదని శాస్త్ర ముద్ఘోషించుచున్నది, అందుచేతనే బాహ్యేంద్రియనిగ్రహము నాబడు యమము ననుసరించి అంతరింద్రియ నిగ్రహకార్య మునుగూడ శాస్త్రముపదేశించుచున్నది. పూర్వార్జిత సద్గుణ పుంజము లన్నియు వ్యక్తిలో సుస్థిరమగుటకై, సంఘమున సంస్థాపితమగుటకై నియమమునుగూడ శాస్త్రము బోధించు చున్నది.

“శౌచ సంతోష తపః స్వాధ్యాయేశ్వర ప్రణిధానాని నియమాః” అని సూత్రకారుల వాక్యము. ఈ విషయములు పూర్వోక్త యమాంగములవలె బాహ్య సంఘముతో ప్రత్యక్ష సంబంధము గలిగిలేకున్నను క్రమన్యాయమున సంఘముపై సూక్ష్మ, సూక్ష్మతర విధమున దమ మహిమను బ్రకటించి, అవ్యక్తరూపముగ సంఘమున బరిణామమును గలుగజేయ గలవు. అంతియగాక యమాంగములు పూర్తిగా స్థూల ములై యుండ బాహ్య జగత్తుతో స్థూల సంబంధ మేర్పరచి, స్థూల పరిణామమును కలుగజేయ, నియమాంగములు పరిసర ములతో సూక్ష్మాతిసూక్ష్మ సంబంధము నేర్పరచుకొని తద్దీతి సూక్ష్మ పరిణామమును కలుగజేయుచున్నవి. అందుచేత

యమముకంటె నియమ మతి ముఖ్యమై యొప్పారుచున్నది. స్థూలముకంటె సూక్ష్మ మతిబలీయముకదా! స్థూల పరిణామ మెంత త్వరితగతి నేర్పడునో అంత త్వరితముగనే నివృత్తి చెందును. కాని సూక్ష్మము స్థైర్యముగా బరిణమించి సులభముగా నశింప నిరాకరించును. మరియు నియమము వ్యష్టిని పరిశుద్ధపరచి, దాని నొక శక్తిస్వరూపముగ బరిణమింపజేసి అందుండి పవిత్ర వాతావరణమును సృజించి, పరిసరములపై బవిత్రతా దీప్తి పుంజముల బ్రసరింపజేసి సంఘ సంస్కరణోద్యమమునకు నా వ్యక్తిని మూలకేంద్రముగా నొనర్చును. కాన నియమ విధానము నొకించుక గ్రహింప యత్నించెదము గాక!

నియమమున గల విషయములు శౌచమునుండి ఈశ్వర ప్రణిధానమువరకు క్రమమున స్థూలమునుండి అతి సూక్ష్మము వరకు బరిణమించుచున్నవి శౌచము బాహ్యాంతర రూపమున ద్వివిధమై మృజ్జలాదిక ద్రవ్యములచే శరీరశుద్ధి గావించుట యగుచున్నది. స్నానాదికముచే బాహ్య శౌచపాలనము లేనిచో శరీరమునం దనేక విధముల మలిన మేర్పడి, చర్మ వ్యాధు లుద్భవించి, అంటువ్యాధులై, తనకు బాధాకరముగ నుండుటయేగాక సంఘమున హేయత్వము జనింపజేయును. క్రమముగ బరిసరముల నది వ్యాపించి సంఘమున ననారోగ్య స్థితిని గల్గించును. అంతియగాక బ్రస్తుతకాలమున సంఘమున గల వ్యాధులలో నధిక సంఖ్యాకములు బాహ్యపరిశుద్ధి చేతనే జనించి, ప్రసరించి, విజృంభించి సంఘమును నాశ

పరచుచున్నవి. అందుచే దన శరీరమును శుభ్రముగా గాపాడుకొనుటయేగాక బరిసరములగూడ బరిశుభ్రముగా నుంచుకొనుచో ననారోగ్యము దూరమై సంఘము శ్రేయో మార్గగామి యగుటకు నవకాశమేర్పడును. కాన నిది చాల ముఖ్యము. మద మానాసూయాది చిత్త మలముల నప నయము గావించుటయే అంతఃశౌచము నా బరగును. అనగా కామ క్రోధ లోభ మోహ మత్సర మదములనా షడ్వర్గము లును, ఆణవ కార్మిక మాయిక మాయేయ తిరోధానము లనెడు పంచమలములును చిత్తమున లేకుండుట నంతఃశౌచ మనియు మనఃశౌచమనియు నందురు. వస్తువును గాంక్షించుట గామము, ఆ వస్తుసంపాదనమున కాటంకమునైం క్రోధము, వస్తు వ్యయమునకై లోభము, వస్తువుపై మోహము, ఆ వస్తు వన్యులదగ్గరగూడ నున్నచో మత్సరము, వస్తువుగల్గుట మదము మొదలగు లక్షణములన్నియు నవలక్షణములై యసంఖ్యాక బాధారూపములై సంఘజీవితమున నశాంతిని కలుగజేయును. అందుచే నట్టి అనారోగ్యలక్షణ విధ్వంసము అత్యంతావశ్యకము. అటులే ఆణవాది మలపంచక నిరోధ మును ఆవశ్యకమగుచున్నది

ఇట్లు మనోపారిశుధ్యము నొందిన వ్యక్తి చిత్త ప్రశాంతతాభాగ్యము నొందినవాడై, నిత్యతృప్తుడై, సంతోషియై మనును. అతడు సత్వశుద్ధి నాబరగు చిత్తశుద్ధిని, దానివలన సౌమనస్యము, ఏకాగ్రత, ఇంద్రియ జయము, ఆత్మదర్శన యోగ్యముల బొంది రంజిల్లును. అందుచేతనే శౌచము ననుసరించి వెనువెంటనే సంతోషము నియమమున ద్వితీయ

స్థానము నలంకరించియున్నది. శౌచమెట్లు ఆరోగ్యవాతావరణము నేర్పరుపగల్గునో అట్లు సంతోషము ఆరోగ్యభావసముదాయము నొసంగి సుఖము జేకూర్చును. సంతోష మన ప్రాణత్రాణమున కత్యవసరమాత్ర దృష్టి గల్గి తృప్తి నందుట యనదగును. దానివలన "సంతోషాదనుత్తమః సుఖలాభః" అనునట్లు ఉత్తమ సుఖప్రాప్తి కలుగును. అనగా విషయముల తృష్ణారహిత విత్తనమున తృప్తి గాంచియుండుటయే దీని తాత్పర్యము. నిత్య సంతృప్త చిత్తునికి, నత్యంతావసర ప్రవృత్తులు, నిత్యానందము బాహ్యాంతరముల దాండవించును గాన నా తృప్తి దీప్తులెల్లరపై ప్రసరించి నిత్యోత్సాహమును, ఆనందమును జనింపజేయును. అవునుగదా. దుఃఖించువారి గాంచువారి హృదయములు దుఃఖాన్వితములై దుఃఖాశ్రువుల వెలిగ్రక్కును. అటులే నిత్య సంతుష్టిజనితానందాశ్రు సంతతి ప్రభావముచే నెల్లెడల నానందమే వ్యాపించి యుండుటయం దాశ్చర్యమేమి? అందుచేతనే దుఃఖము గల్గువేళల నింట నుండుటయు, సంతోష సమయముల నిల్లు వెడలుటయు వివేకానందుడు నిర్దేశించియున్నాడు. అట్లగుటచే దుఃఖము వ్యాపింపక నింటనే సమసిపోవుచుండును. సంతోష మారోగ్యకర లక్షణములతో దేశవ్యాప్తి గాంచి యెల్లరకు నానందసుధను బంచిపెట్టును. కామసుఖమనియు, దివ్యమైన సుఖమనియు గీర్తింపబడు లోకసుఖములన్నియు దృష్ణాక్షయ సుఖముతో బోల్పరానివి. అందుచేతనే సంతోషసాధన మతి ముఖ్యముగా విరాజిల్లుచున్నది.

అదేవిధానమున "తపో ద్వంద్వ సహనం" అనురీతి క్షుత్పిపాసా శీతోష్ణస్థానాసనాది ద్వంద్వముల, మానాభిమానాదికముల, కష్టసుఖముల యెడల సహనభావము గల్గియుండుట తపస్సగుచున్నది. దాన సంఘ క్షేమ కార్యనిర్వహణ కాలముల నీ తపోశక్తి యవసర మగుచున్నది. కామేంద్రియ సిద్ధి కలిగి ఎంతటి ఘన కార్యమునైన సాధించుటలో నీ తపస్సు మహోపకారి యగుచున్నది. ద్వంద్వ సహనశక్తి లేనివాడు స్వీయ కార్యనిర్వహణాసమర్థుడై పరులపై నాధార పడుచు, దమోమయ జీవితమును గడుప నుద్యుక్తుడగును. అందుచే నన్య కష్ట ఫలితములపై నాధారపడు పరాధీనుడగును. అట్లుగాక స్వకార్యదురంధరత్వమున నాదర్శ కష్టజీవియై, పరులలో నుత్తేజము నెలకొల్పు ఉత్సాహశక్తియై, సర్వోపయుక్త మహామహిమ నాతడు వర్థిల్లును. అతని వాతావరణమే యాహ్లాదకరము.

దీని కనుగుణముగ "మోక్ష శాస్త్రాణా మధ్యయనం" అనునట్లు సర్వ ప్రాపంచిక జీవనము నే యాధ్యాత్మిక సుఖమున కంకితము సేయవలయునో, యీ సర్వైహిక సుఖసంపత్తి దేని అన్వయానంద సుఖసాగరమున రేణువులై తోచుచుండునో అట్టి అద్వయానంద మోక్షసామ్రాజ్యమును గూర్చియు దత్సిద్ధికై సాధనాకలాప వివరణమును, తదనుభూతి నిమగ్నులైన మహాపురుష జీవితోపదేశముల బోధించు సద్గ్రంథ శ్రవణ పఠనము లాతని జీవితమున కొక నూత్నాలంకారము నొసంగి శాంతిచంద్రికల నల్గడల ప్రసరింపజేయ గల్గును. అంతియగాక ప్రథమమున సూచింపబడిన జందము

శ్రోత్రియత్వముండినగాని దేశాచార సంప్రదాయముల గ్రహించి, తదనుగుణ నాయకత్వము వహించి, సంఘము నుజ్జీవింపజేసి, సక్రమాభివృద్ధికి సహకారి కాగలసమర్థు డెవ్వఁడును గాజాలడు. అందుచే స్వాధ్యాయముగూడ నత్యావశ్యక మగుచున్నది. దేశ సాంప్రదాయానుసార ప్రబోధ గావించి యత్నించుచో నచిరకాలమున దేశము సంపూర్ణాభివృద్ధి నొందు నను మహారహస్యమిం దిమిడి యున్నది. స్వాధ్యాయఫలితముగ నిష్టదేవతా సంప్రయోగము నచింపబడియుండ నిక నిష్టదేశాభివృద్ధి సుసాధ్యమగుననుట సమంజసముగదా! ఈ రహస్యమును గ్రహించియే గాంధీమహాత్ముఁడును సత్యాగ్రహ భగవద్గీతాది సుసంప్రదాయక విషయముల హస్తముల ధరించి, అపూర్వ కీర్తి నార్జించి, భారత స్వాతంత్ర్యసిద్ధికై ప్రజానీకము నేకత్రాటి నడిపించి కృతకృత్యుఁడయ్యెను.

పై యంశముల నెంత గడించి యున్నను నీశ్వరాస్తికతను విశ్వసింపకున్నచో బూర్వ కృషి యంతయు నిష్ఫలముకా నవకాశముండును. సర్వశక్తి సముపార్జిత విభూతు లన్నియు దన యల్పత్వమును విస్మరింపజేయుచు మరల నియంతృత్వమునకు, బర పీడనమునకు దారి తీయవచ్చును. అంతియగాక నీ యైహిక సంపత్సుఖములన్నియు మానవుని విశాల దృష్టిని లోపింపజేయుచు, జాతి జాత్యంతర, శాఖ శాఖాంతర, మత మతాంతర, దేశ దేశాంతర తారతమ్యముల కవకాశమిచ్చుచు, స్వపరభేదముల బెంచుచు, బాషండత్వమును వర్ధిల్లజేసి, అరాచకమునకు మార్గదర్శి కాగలవు.

అందుచే మానవునిచే ననుభవింపబడుచున్న యానత్ప్రపంచ
మునేగాక నాతనికి దిగ్భ్రమ కలుగజేయుచున్న అనంత తారా
గ్రహ సముదాయమును, తన కత్యంత సన్నిహితమై చేదోడు
వాదోడుగా బ్రవర్తించుచు సర్వము ననుభవింపజేయుచున్న
దైనను నొకొక్కవేళ వ్యతిరేక ప్రవృత్తిచే నతనిలో గల
వరమును జెలరేగదీసి యొక మహత్తర సమస్యగా బరిణమించు
చున్న నతని మనస్సునుగూడ సృజించి, పెంచి, కాలగతమున,
లయింపజేయు నీ అమానుష శక్తిసంపన్నుడు, ప్రజ్ఞాశీలుడు,
అఘటనాఘటనా సమర్థుడు సర్వేంద్రియజ్ఞానాతీతుడగు నొక
సృష్టికర్త గలడనియు, బ్రథమమున విశ్వసింపవలెను. అతని
యధీనములై సర్వ చరాచర జీవకోటి నర్తించి సుఖము
నొందుచు, తద్విరుద్ధ ప్రవర్తనముచే దుఃఖము నొందుచు
నుండుననియు గ్రహించి, రాజాధిరాజునకు తదధీన ప్రజా
నీకము పన్నుల జెల్లించునట్లు ఈశ్వరాధీన మానవుడుగూడ
తగు గప్ప మతనికి గట్టవలయు ననియు గ్రహించి, అట్టి
యలౌకిక శక్తియుక్తునికి సర్వార్పణముజేయుచు బ్రపన్నత
మెలంగుటయే ఈశ్వరప్రణిధాన మనునది నియమ పంచ
మాంగము. పూర్వోక్త నవకముకంటె నిది అతి ప్రధానమై
వ్యక్తి స్వభావమునేగాక ప్రపంచ రూపమునగూడ నభివృద్ధి
కరముగ బరిణమింపజేయు నద్భుత శక్తియై యున్నది. ప్రాచీ
నాధునిక కాలముల సర్వప్రపంచ చరిత్రమును బరిశీలించి
చూచుచో నమానుష కార్యధురీణులెల్లరు నా సర్వాధిపతి
యగు నీశ్వరార్పణబుద్ధిచేతనే మహత్కార్య నిర్వాహకులై
యుండిరను బరమరహస్యము వ్యక్తమగును. కపిల వ్యాసాది

ప్రాచీన మహర్షికోటి యేమి రామకృష్ణాద్యవతార పురుషు లేమి, శంకర రామానుజాది ఆచార్యగణములేమి, బుద్ధ క్రీస్తు మహమ్మదాది మతప్రవక్తలేమి, యీశ్వరార్పణబుద్ధిజన్య మహాద్భుత శక్తివిశేషముచేతనే ప్రపంచోద్ధరణ కార్యమున కృతకృత్యులై యొప్పిరిగదా! రామకృష్ణ, వివేకానంద, గాంధీ మొదలగు ఆధునిక సంఘోద్ధారకులుగూడ నా పరమేశ్వర ప్రపన్నచిత్తయుక్తులై తమ జీవితకాలముననే యావత్ప్రపంచ మును గదిలించి, ప్రజానీక స్థూలసూక్ష్ముల సూక్ష్మమొనరించి, అభౌతిక చిన్మయానంద సంధాన సౌఖ్యమున సర్వ ప్రపంచము నోలలాడించి, దివ్య సందేశముల బ్రసాదించి, సార్థక జన్ములై విరాజిల్లిరి. ఈశ్వరార్పణబుద్ధిలేని ప్రాపంచిక సంపత్తులు ప్రాచీనకాల రాక్షససంపద్విశేష తుల్యములై, ప్రపంచ శాంతికి భంగకరములై, విధ్వంసకరములై సర్వనాశన హేతువు లగుచుండును. ప్రకృతిశక్తుల స్వాధీనపరచు కొనిన రాక్షసశక్తులకు యీశ్వరార్పణ బుద్ధియే పునాదిగా యున్నచో నవి దైవశక్తులై, శాంతిసంధాయకములై, లోక పురోగమన కారకములై చెల్వొంది యుండెడివి. అట్లుగాకుంట నవి సంఘమునకు వేరుపురుగులై, సంఘ విచ్ఛేదక శక్తులై సర్వనాశన మొనరించి యుండెను. కాన మన మహర్షిలోకము సర్వేతర ప్రవృత్తులకంటె శక్తులకంటె యీశ్వరప్రణిధానము నకు బ్రముఖస్థాన మొసంగి అద్దానికే సర్వత్యాగ మొనరించి దాని సాధించి, ఆ యలౌకిక దృష్టి మానవకోటిని వీక్షించి, యిందుగల సర్వానర్థదాయక ప్రవృత్తుల దిలకించి, దుఃఖితుల

గసుణించి, దుఃఖమునుండి తరుణోపాయమును బోధించి యావత్ప్రపంచమునకు మహోపకృతి నొనరించియున్నారు.

## భగవద్విశ్వాసము

కావున పై వివరింపబడిన యమ నియమ రహస్యములు సంఘమున స్థిరముగ నెప్పుడు నెలకొనునో, అప్పుడే వ్యక్తికి, సంఘమునకు మానవకోటికి శాంతి సంప్రాప్తించును. అట్టిది లేకుండుటయే సర్వానర్థదాయకము ఆ లోపమును సరిదిద్దు కొనుటయే ప్రథమ కర్తవ్యము. అద్దానికై ప్రస్తుత ప్రపంచమున మరుగుపడినట్లు తోచుచున్న ఆధ్యాత్మిక దృక్పథమును బునరుద్ధరించుట యవసరము. అనగా దేశదేశాంతర విభేదములతోగూడిన మతదృష్టియు, దేశ కాల తారతమ్యములచే విభిన్నత జాటించు ఆచార సంప్రదాయ పద్ధతులనుగాక సర్వ మతాచారముల కధిష్ఠానముగా నొప్పు భగవదాస్తికత, భగవద్విశ్వాసము, ఈశ్వరార్పణబుద్ధి, మానవలోకమున సుస్థాపితమై యొప్పారినచో సర్వశ్రేయోరాజ్యము ప్రపంచమున నేర్పడగల్గును. మనగౌరవమర్యాదల బొందు మానవుడెంతవాడైనను, నెంత శక్తిసామర్థ్యములు గలవాడైనను, సర్వజ్ఞుడైనను, సజాతీయతాదృష్టి దోషమున గొన్ని మానవ జాతిదోషము లాతనియందుఁగూడ దోచుచుండుటచే, క్రమముగ నాతనిపై గల గౌరవము క్షీణించి సంఘ శ్రేయస్కాముడైన ఆవ్యక్తి యాజ్ఞాపాలనమునకుగూడ భంగము వాటిల్లుచుండుట లోకవిదితము. అందుచేతనే కేవలము మహావిష్ణ్వంశ సంభూతుడని నాటికాలముననే యనేక మహర్షిగణముచే గ్రహింపబడి, గౌరవ పూజాదికము గైకొనగల్గిన శ్రీరామ

చంద్రుని, దండ్రియగు దశరథుడు బాలునిగను, అసమర్థునిగను దలంచి తన యజ్ఞానమును వ్యక్తపరచెను. అట్లే కైకేయి శ్రీరాముని సవతిపుత్రునిగ చూచి అసూయాగ్రస్తయై అరణ్యావాసునిగ నొనర్చెను. అదేవిధమున శ్రీరాముని యసమాన అద్వితీయ శక్తిసామర్థ్యముల దిలకించియు, నతడవతార పురుషుడే యని గ్రహించియు, నతని మానవాకృతిచే విమోహితుడై సామాన్యునిగ మరుక్షణమున విభ్రాంతుడై రావణు డెదిరించెను. శ్రీకృష్ణచారిత్రమునగూడ నిట్టి దృష్టాంతము లనేకములు గోచరము. అమానుషలక్షణముల నసంఖ్యాకముగ బ్రదర్శించు బాలుని జూచి పుత్రభావమున మమకారదృష్టితో యశోద శ్రీకృష్ణుని గట్టనుద్యుక్తురాలయ్యెను. గోపాలురు తోడువానిగ నతనిజూచికొనిరిగదా! అద్వితీయమైన అలౌకిక శక్తి సంపన్నుడని గ్రహించియు లౌకిక బాంధవ్యమునమాత్రమే గాంచి యతి సన్నిహితత్వము నొందియు నర్జునుడు అజ్ఞానిగ జీవితాంతముపరకు నుండెనుగదా! సజాతీయ దృష్టిదోషమునవేగదా బుద్ధ భగవానుడు పడరాని కష్టముల నొందియుండెను. అటులేగదా ఏసుక్రీస్తు శిలువ బాధ ననుభవించెను. మరియు మహమ్మదుప్రవక్త దేశ దేశముల బారిపోవుచు యుద్ధజ్వాలల బాధ ననుభవించుటకు నితరుల దోషదృష్టియేగదా కారణము! అంతవర కేల? మొన్ననేగదా తన శాంతిచంద్రికా మహాత్మ్యముచే నొక్క భారతావనినే గాక యావత్ప్రపంచమునుగూడ నురూతలూగించిన మన గాంధీమహాత్ముని లోక మెన్నిరీతుల విమర్శించి చివరకు హత్య గావింపలేదు.

అందుచే నెంతవాడైనను మానవాకృతి గల్గి మానవులతో గలసిమెలసి ప్రవర్తించువాడు ప్రపంచమున జిరస్థాయిగ శాంతి నెలకొల్ప సమర్థుడుకాడు కాన బూర్వోక్త మహాపురుషుల కట్టి అమానుషశక్తి సామర్థ్యముల ప్రసాదించి, తన దివ్యమంగళకర గుణపుంజములో నత్యల్ప భాగమును వారిలో ప్రతిబింబింపజేసి, లోకమున గొంతవరకైన లోకక్షేమంకర కార్య నిర్వహణము గావింపజేసిన సర్వ మతాంతర్గత పరమేశ్వరునిపై దృష్టుల బ్రసరింపజేసి అతని యనుగ్రహవీక్షణా నిరీక్షనవృత్తి ధార్మిక జీవితమును గడుపుచు, దా జేయు సర్వ కార్యముల నాతని కృపాపాత్రతకొరకే యని విశ్వసించి చేయుచు, మానవసేవయే మాధవసేవ అనుటయే గాక సర్వకార్యముల నీశ్వరారాధనగా గావించుచు, నాత్మోద్ధరణ, సంఘోద్ధరణములకై కృషి గావించు టుచితమని ప్రాచీనుల దాత్పర్యము. అట్టి పరమాదర్శ దృక్పథమున గావించు సర్వకార్యములు నిర్మాలిన్యములై, ఆదర్శవంతములై, లోకహితంకరములై చెల్వొందును.

## శిష్టాదర్శము

అట్టి మహాదాదర్శ మార్గగాములై, ప్రాచీనకాలమున మహర్షి వరేణ్యులు తమ తమ వ్యష్టి కామ్యముల బ్రక్కనుంచి, యుగారణ్యముల ఘోరతపశ్చర్యచే మహోత్కృష్ట తాత్విక సిద్ధాంతముల గ్రహించి, లోకమునకు బ్రసాదించి యుండిరి. ఆదివిద్వాంసుడును, నతి ప్రాచీనుడును నైన కపిల మునిచంద్రుడు కర్దమ దేవహూతి గర్భముక్తాఫలమై ప్రపంచమునగల (ఆధ్యాత్మిక, ఆధిదైవిక, ఆధిభౌతిక దుఃఖముల

యునికిని విమర్శించి, గ్రహించి వానినుండి మానవకోటి నుద్ధరింప సర్వప్రపంచమునకు ప్రథమ తత్వశాస్త్రముగా సాంఖ్య సిద్ధాంతమును ప్రకటించియుండెను. అటులే యైహిక సుఖములబారి జనక ప్రపంచ దుఃఖమునకు గారణము మనో చాంచల్యమని యెరింగి తన్నిరోధ స్వాధీనములకై పతంజలి యోగిపుంగవుడు యోగ దర్శనమును ప్రసాదించియుండెను. వ్యాసభగవానుడును ఈశ్వరరూప నిర్వచనము గావించి, మానవకోటి దృష్టుల స్థూలములై కుంగదీయు లౌకికసుఖ సంపదనుండి యుద్ధరించి, అలౌకికానంద సంధానమున ప్రతి ష్ఠింప వేదాంత సూత్రముల నిర్మించి, ఆచంద్రతారార్కముగ ప్రపంచమున దాత్త్వికదృష్టిని సంస్థాపించియున్నాడు.)

పురాణపురుషుడైన హరిశ్చంద్ర చరితా మాధుర్య మును జవిచూడని భారతీయుడుండడు. ఆ సార్వభౌముడు సత్యాదర్శమునకై సర్వమును త్యాగము చేసి ప్రపంచ చారిత్రమున నొక యలంకారమై వెలుగొందియున్నాడు. రామరాజ్య గాథ నెల్ల రెరింగినదియే శ్రీరాముశరణ్యముల కేగనేల? ఇడుమల గుడువనేల? రాక్షసుల నెదుర్కొననేల? ఆ మహాప్రభుజీవితమున సర్వకార్యములును లోకాదర్శము న కేగదా! రావణు జయించి సింహాసనము నధిష్ఠించి, సర్వ సామ్రాజ్యాధినేత యయి యుండియు, పవిత్రమాత సీతను గానసముల బరిత్యజించుటయందు గల రహస్యము చాకివాని మాటయేగదా! అనగా సంఘక్షేమమేగదా! ఆరాంజేమునికి ప్రజయే ఈశ్వరమూర్తియై స్వీయ దారాపుత్రాదికమంతయు నత్యల్పముగ గోచరించుటయం దాశ్చర్యమేమి? అటులే

శ్రీకృష్ణపరమాత్మయు జక్రవర్తుల నేర్పరచు నియంతయై యుండియు, నాధ్యాత్మిక దృష్టి ప్రభావమున దా చక్రవర్తిత్వము స్వీకరింపక, సామాన్య మానవజీవితానందమున మునిగి, నిష్కామ కర్మమార్గమున బోధకుడై, యా అనాసక్తయోగము లోకక్షేమమునకై అర్జునునిద్వార బోధించియుండెను.

చారిత్రికయుగమున దిలకించుచో బుద్ధభగవానుని యాదర్శము లోకము నంతటిని అద్భుతాశ్చర్యచకితుల గావించును. ఆ నవయౌవన చక్రవర్తి వృద్ధ జనకుని, అతిసుందరవతియగు సతిని, చిదిపిన పాలుగారు పసికందువును, సామ్రాజ్యమును, నెపరి సుఖమున పేక్షించి ఆ మహానుభావుడు త్యజించెను? ప్రపంచమున గల దుఃఖ నివారణోపాయ మెందున్నను జివరకు నరక కూపముననున్నను సాధించి, గ్రహించి, లోకమున బంచిపెట్టువరకును నిద్రాహారములగూడ నర్జించు తీవ్రదీక్షాపరుడగుటకు గారణ మెయ్యది? లోకక్షేమమేగదా! ఆ మహనీయుని ప్రశాంత తేజోకిరణప్రసార తాడితమనస్కుడైగదా బింబిసార చక్రవర్తి ఆదర్శ రాజ్యాంగతంత్రమును నడిపెను? రక్తము జిందింపక క్షేమంకర కార్యములచే ప్రజల నాకర్షించి సామ్రాజ్యమును విసరింప జేసి అహింసావ్రత దీక్ష ప్రజలలో జొప్పించి, అన్యాయ ప్రవర్తనము నభావము గావించి, సర్వ శ్రేయోరాజ్యమును స్థాపించి, నేటికిని ప్రపంచమున నద్భుత చక్రవర్తిగ గీర్తినార్జించి, ప్రస్తుత భారత ప్రభుత్వమున కాదర్శమూర్తియైన అశోకుడు ఆ బుద్ధదేవుని యాధ్యాత్మికశక్తి ప్రసార మహిమాకర్షిత చిత్తుడు కావుట చేతనేగదా! అటులే యేసు అష్టకష్టములకు లోనయినను

నీశ్వరుపైనే దృష్టుల నుంచి ఈశ్వర సంతానమగు మానవ
కోటిని సన్మార్గమున నడిపింప యత్నించి శిలువ కర్ప
ణామై, సర్వమానవోద్ధరణ కార్యమున జయము గాంచెను;
ఆ యాధ్యాత్మిక దృష్టి మహిమచేతనే మహమ్మదు మొదలగు
ననేక ప్రవక్తలు సర్వసౌభ్రాతృత్వ స్థాపనమునకై పెక్కెడు
మల బాలైరి! నాగార్జునుడేమి, శంకరుడేమి, రామానుజ
మధ్వాచార్యులేమి యా ఈశ్వర ప్రేరిత ప్రబుద్ధ చిత్తులై,
స్వార్థత్యాగధనులై తమ యాత్మానంద సౌఖ్యముల సంఘ
మున నాటి యసంఖ్యాకులకు శాంతిభిక్ష నొసంగిరి. శ్రీరామ
కృష్ణ వివేకానందాది యుగపురుషులును ఆ యీశ్వరార్పణ
బుద్ధిజనిత మహాశ్శక్తిచే మానవకోటికసాధ్య కార్యనిర్వహణా
ధురీణులై అసాధారణ త్యాగోద్భూత సాధనామగ్న చిత్తులై
మత మతాంతర విభేదముల మడిచి, సర్వసౌభ్రాతార్థ దివ్య
సందేశముల బ్రపంచమున నల్దెసల జాటి, మహోపకారము
గావించిరి. అదే విధముగ మహాత్మ గాంధియు నాబాల్య
మాదర్శ ప్రశాంత రామరాజ్య స్థాపనోద్దేశమున శ్రీరామ
కార్యదీక్షాదక్షుడై, సహస్రాధి బాధలకోర్చి, భవిష్యత్కాల
శాంతిసామ్రాజ్యమునకు బునాదుల నిర్మించెను. అందుచే
బ్రపంచమున నేకార్యము జేసినను నద్దాని నాధ్యాత్మిక
దృష్టితో ననగా వ్యష్టి సమష్టుల శ్రేయస్సు నపేక్షించి
యాచరించుట ముఖ్యముగా మహాపురుషుల జీవితోపదేశ
ములు చాటుచున్నవి.

## వ్యష్టిపరిభావము – సమష్టి

మరియు వ్యక్తికిని సంఘమునకునుగల సంబంధ మెట్టి

దని విచారించుచో సంఘమున వ్యక్తి బహుళత్వమే యని గ్రాహ్యమగును. వ్యక్తియే సంఘము, సంఘమే వ్యక్తిగ రూపొందుచున్నది. కాన సమష్టి యనబడు సంఘ పారిశుద్ధత వ్యక్తి పవిత్రతపై నాధారపడి యుండును. వ్యక్తి పరిశుద్ధు డగుచో సంఘముగూడ గాల(క్రమమున పరిశుద్ధమై శాంతి నొందియుండును. మంచిగంధము వృక్షముల యరణ్యమునగల సర్వేతర వృక్షజాతులు నావృక్ష సజాతీయత్వము నొందునను నార్యోక్తి చంద మాదర్శ మహాపురుష సన్నిధానమున బరిసరములు బునీతములై క్రిమన్యాయమున దాదాత్మ్యత నొందుచున్నవి. అట్లుగాక దుర్మార్గుని యునికిచే వాతావర ణము సంక్షుభితమై బాధాకరమై నీచత్వమును బొందును. అట్లే గదా ఫలరాశిగల శ్రేష్ఠత కుళ్ళిన ఫల సంగముచే నశించి రాశియంతయు నచిరకాలమున భ్రష్టత నొందునుగదా! ఆ సూత్రమున నేగదా క్షీరము దధిరూపము వహించుట! ఎంతటి బలమైనను సంఘమైనను ననారోగ్యపురుషుని యునికి చేవ్యాధిగ్రస్తమై నశించుచున్నది. అటులే అనారోగ్య భావ సంచయముగల దుర్మార్గునిచే సంఘము చెడి కల్లోలిత మగు చున్నది.

ఈ విషయమునే వివరించుచు శంకర భగవత్పాదులు "సత్సంగత్వే నిస్సంగత్వ" అను సూక్తిని గానము చేసి యున్నారు. అనగా సత్సాంగత్య మహిమచే నెంతటి దుష్టాత్ము డైనను సన్మార్గవర్తను డగునని తాత్పర్యము. వ్యక్తిలో జనించు భావజాలములు వెంటవెంట నదృశ్యమొందక, నా వ్యక్తిలో సంస్కారరూపమున నంతర్గతమగుట యేగాక,

బాహ్య వాతావరణమున అనుద్భూతస్థితిలో నెగురుచుదిరుగు
చుండును. ఆ పరిసరములగల వారెట్టివారైనను చిత్తవృత్తులు
లేని ప్రశాంతతనున్న సమయముల నాచిత్తమున ప్రవేశించి,
యందు నాటి, మొలకరించి యభివృద్ధినొంద యత్నించును.
ఆ భావము దుష్టమైనచో శిష్టునినైన మార్ప యత్నించును.
అది బలీయమైనచో శిష్టత్వమునకు బాధ కలిగి ఆ శిష్టుడు
దుష్టవర్తనుడుగా మారిపోవును. అటులే భావము శిష్టమైనచో
దుష్టుడైనను శిష్టుడుకా నవకాశ మేర్పడుచున్నది.

మరొక సిద్ధాంతమున బ్రపంచమునంతట జీవకణములగు
స్కంధములు వ్యాపించియున్నవి. అవి ప్రవాహరూపముగ నొక
వ్యక్తి నుండి మరియొక వ్యక్తికి బ్రసరించుచుండును. కాని అవి
ఆ యా వ్యక్తుల సంస్కారముల గొన్నింటిని వెంట గైకొను
చుండుటచే నొక పురుషునిలక్షణముల నితర పురుషులకు జేర
వేయుచు నా యా పురుషుల స్వభావములనే పరిణమింప
జేయుచు నుండునని తజ్ఞులందురు పుంఖాను పుంఖములుగ నీ
స్కంధసముదాయ మసంఖ్యాకముగ సెకనున కేడు పర్యా
యములుగ నొక్కొక్క పురుషునుండి బహిర్గత మగుచుండునని
యా సిద్ధాంతము. అందుచే సంతత ప్రవాహరూప సంస్కార
స్కంధముల నీదులాడుచున్న పురుషునికి వ్యష్టిత్వము కేవ
లము భ్రాంతిరూపమేకాని ప్రత్యేక సత్యముగాదని విది
తము. అట్టిచో బెద్దయంత్రమున గల అల్పాంగమున కెట్లు
వ్యక్తిత్వ మభావమో అటులే యీ ప్రపంచరూప సమ
ష్టిలో వ్యష్టికి వ్యక్తిత్వము సంపూర్ణముగా శూన్యము.
సాగరమున తరంగములవలె వ్యష్టి నామరూపాత్మకముగ

సమష్టియందే దోచి మరల నందే లీనమగుచున్నదని యంత రార్థము.

ఈ రహస్యమును గ్రహించి మానవుడు తన రక్తము ద్వారా తన దారాపుత్రాదికమున నేగాక తరతరములపర్యంత సంతానమునకు దన సంస్కారముల బ్రవహింపజేయుచుండుటయు, అంతియగాక దన దుష్టత్వ శిష్టత్వముల నగోచరలీల బూర్వోక్తవిధముగ బరిసరజీవకోటిపై బ్రసరింపజేసి కలుషితముగనో, పునీతముగనో యొనర్చుచుండుటయు గ్రహించినచో, నట్టి అతి భార బాధ్యతను గుర్తించుచో అతనిలో నెట్టి పరివర్తన మేర్పడునో! శిష్టత్వమునే బెంపొందింప యత్నించు వానిలో శిష్టభావములు, తదనుగుణ స్కంధములు బ్రవేశించి రాణించుటచే నీ రహస్యము నెరింగినవా డచిర కాలమున నెట్టివిధముగ బరిణమించునో! ఈ కీలకము నెరింగి తదనుగుణ వర్తనము గల వ్యక్తి కాలక్రమమున నొక ఆధ్యాత్మిక మహాశక్తి యంత్రమై, తన మూర్తినుండి అవ్యక్తముగనే అసాధారణ శిష్ట సంస్కారప్రసారములచే మానవకోటి నుద్ధరించి యెంతటి లోకోపకారి యగునో! అట్టివాడు యేమరుపాటు గాంచక, నప్రమత్తత లేక, నిత్య జాగృతి నసించి, మహోన్నత భావములకు యంత్రాగారమై, తదభావ లోకమున వాని నుజ్జీవింపజేసి, జగదుద్ధరణశీలుడై కృతకృత్యుడగుచున్నాడు. వాని జీవితము ధన్యము. ధన్యాతిధన్యము.

## శాంతి సంధాత

ఈ అద్భుతాదర్శ స్థితి సముపార్జనమునకు లౌకిక భావములు, వ్యక్తులు నసమర్థములు. "నీచాః కలహ మిచ్ఛంతి

సంధి మిచ్ఛంతి సాధవః" అనురీతి సంఘమున శాంతి నాకాం క్షించువాడు శాంతుడై యుండినగాని యతని కాంక్ష సఫ లము కానేరదు. స్వీయ నేత్రముల గల దూలముల జూడ నొల్లక నితరుల గన్నుల గల నలుసులకై యన్వేషించువా రధికముగదా! స్వీయ దోషముల బ్రిథమతః బరిశీలించి, గుర్తించి, గమనించి, సంస్కరించి, పిమ్మట బరదోషముల సంస్కరింప యత్నించు సంస్కర్త లేరి? తా జేయున ట్లాచ రింపక బోధించున ట్లనుసరింప నాదేశించు గురువులేగాని బోధనానుష్ఠానముల దమలో మేళవింపజేసుకొని యితరుల కుపదేశించు ఉపదేష్ట లేరి? కోపమును జయింపుమని కోపించు ఆచార్యులేగాని కోపతాపవివర్జితాదర్శ మేది? అందుచే నున్న తాధ్యాత్మిక ప్రిశాంతచిత్తులై, యలౌకికానంద నిమ గ్నులగు ఆదర్శ పురుషులు, కామ్యావివర్జిత మనస్కులు, నిష్కామ కర్మ ధురీణులు, కరుణార్ద్రిహృదయులు, సర్వ సమ న్వయ సమరస భావగంభీరులు నగు మహాపురుషులు శాంతి సంధాత లగుదురుకాని అన్యులు కానేరరు.

## శాంతి – తాత్త్వికదృష్టి

కాన సర్వ ప్రపంచమతముల కధిష్ఠానములై తాత్త్విక దృష్టి నొసంగిన మతాచార్యులగు శంకర, రామానుజ, మధ్వాది గురులోకము తత్త్వదృష్టితో దీని నెట్లు తీర్మానిం చిరో చూచెదముగాక!

నిర్వికార నిరాలంబ నిరాకార నిరంజన నిర్మల నిరతి శయ నిశ్చలానిర్వాచ్యమైన బ్రిహ్మము స్వీయ మాయాబల

మున వికారమై, యసంఖ్యాకములగు జీవకోటిగ బరిణమించి నటుల దోచుచున్నదనియు, గాని సద్విమర్శాదృష్టి బరిశీలించుచో నది యథార్థమైన మార్పుగాక వివర్తరూపమున జరిగినదనియు శ్రీశంకరాద్వైతవాదము. అనగా బ్రహ్మము నిర్వికారమై యున్నను నతని నధిష్ఠానముగ గల్గిన అఘటనా ఘటన సామర్థ్య సంపన్నమైన మాయ అనేక రూపముల జిత్రించి, ఆడించి మరల నా బ్రహ్మమునందే లయ మొనర్చుచున్నదని తాత్పర్యము. అట్టి దృష్టాంతములు లోకమున నెన్నియో గలవు. మందాంధకారమున జూడబడిన త్రాడు సర్పరీతి గోచరించుట సామాన్యానుభవమేగదా! అటులే మృగతృష్ణ నాబడు ఎండమావును గాంచి అజ్ఞజీవులగు పశు పక్ష్యాదులేగాక మానవులుగూడ జలప్రవాహమని భ్రమించి యన్వేషించుటయు విదితమే. అట్టివే శాస్త్రవర్ణిత శుక్తిరజత, స్థాణుపురుషాదిక భ్రాంతులు. అందు నధిష్ఠానరూపమైన పదార్థమును మరుగుపరచి తానే సత్యముగ భాసించును. అనగా ముందు గల రజ్జువుపై దృష్టిలో సంస్కారరూపమున గల సర్పము, తనకు రజ్జువునకు గల సాదృశ లక్షణముల నండగ గైకొని రజ్జువుపై దానే భాసించి, సర్పభ్రాంతిని దృష్టకు గలుగజేయుచున్నది. యథార్థమైన అధిష్ఠాన రజ్జుజ్ఞానము కలుగగనే అసలు సత్యముగ నట నభావమైన సర్ప మదృశ్యమై సత్యమైన రజ్జుజ్ఞానము ప్రస్ఫుటక్రియ దోచును. స్వప్నదృష్టాంతమునగూడ సుషుప్తినున్న వ్యక్తి నిర్వికారమున నుండ, అతనిలోగల చిత్తము స్వీయ సంస్కారములు,

రూపవంతము గావించి, యనేక దృశ్యముల జితించి వానితో క్రీడించి, సుఖదుఃఖముల ననుభవించి, స్వప్నాంత మున మనస్సులో లయమగుచున్నది. ఇచ్చట నధిష్ఠానము మనస్సు. దృశ్యములు సంస్కార జన్యములు. ఎట్లైనను ఉన్నది మరుగుపడి, అట లేనిది దానిపై భాసించి, అదియే సత్యమై నట్లు భ్రాంతిని కలుగజేయుచుండుటయే యిందలి రహస్యము.

పై సిద్ధాంతరీతిగా వ్యష్టిరూపమున గోచరించు నీ జీవ కోటి కధిష్ఠానముగ బ్రహ్మము గలదనియు, నీ జీవరాసులతో ప్రపంచము భ్రాంతిజన్యమనియు నర్థము. భ్రాంతి యనుట తోడనే అయథార్థములని భావింపక నప్రధానములని గ్రహిం చుట ముఖ్యము. కాన వ్యష్టిరూపములైన వివిధ దృశ్యములు ప్రధానముగాక తదాధారభూతమైన బ్రహ్మము ముఖ్యాతి ముఖ్యస్థానము నలంకరించుచున్నది. ఈ తాత్పర్యగ్రహణ మున తజ్ఞునిలో విశాలత్వమేర్పడి, ప్రాపంచిక సుఖ సము దాయముపై మోహము క్షీణించి, ఎల్లకాలముల ప్రశాంత చిత్తుడై యతడలరారుచుండును. కాని దీని భ్రాంతిరూప ముగ ద్రోసిరాజనుచు, లోకక్షేమమున కతడు కృషి సల్ప డనువాదము లేకపోలేదు. అట్లు పూర్వమెన్నడును జరిగి యుండలేదు. అద్వైతానంద విభూతుల నోలలాడిన మహా గురువరేణ్యులు తమ యసమాన మనోబలముచే ప్రపంచ శాంతికి మార్గదర్శులై సదా వెలుగొందుచునే యున్నారు. వారనుభవించుచున్న యలౌకికానుభూతి సర్వమానవులకు దూరమగుట వారెరుంగుదురు. కాని దాని నితరులు సంపా దింప బూర్వోక్త యమ నియమాదుల నిష్ణాతలై పరిసరముల,

కాదర్శ శ్రేయోమూర్తులుగ బరిణమించుచుండవలెను. అందుచేతనే వ్యాస, శంకరాదులు వేదాంత- శ్రవణము నితరులకొరకు బ్రతిపాదించిరి. దానికై సాధన సంపద్విభూషితులై యుండవలయునని నియమమేర్పరచి యుండిరి. ఇట్లు అద్వైతసిద్ధి గోరువారు ప్రథమతః ఆత్మ సంఘ సంస్కరణ కార్యముల బాధ్యులై కాలాంతరమున శుద్ధాద్వైత సుఖమున మునిగి ప్రపంచ సుఖములనుండి విశ్రాంతి గైకొనిన సంఘమునకు నష్టమేర్పడదు. ప్రభుత్వోద్యోగియైనను ఉద్యోగ కాలమున సక్రమరీతి బాధ్యతల నిర్వహించి, కొందరికి శిక్షణ మొసంగి నియమిత కాలానంతరమున ఉపవేతనమున విశ్రాంతి గైకొనుచుండుట సాధారణమేగదా! అదేరీతి నద్వైతాచార్యులును తమ నాశ్రయించిన శిష్యవర్గముల జిత్తసీమల బవిత్రపరచి, శుద్ధసంస్కారముల నభివృద్ధి జేసి, తద్రూపముగ సంఘము నుజ్జీవింపజేసి, విశ్రాంతిలో ఆధ్యాత్మికానందము ననుభవించుచుండుటయం దెట్టి దోషము నుండదు. అందుచేతనే శ్రీ శంకరులు కేవల మద్వైత దివ్యానందమున లయించి యుండక, తత్సిద్ధాంతమును దేశవ్యాప్తముగ బ్రబోధించి, యంత దృప్తిగాంచక బ్రశస్త మఠముల నల్దిశల స్థాపించి, భారతావనిగూడ నాలుగు భాగముల విభజించి, ఆ పీఠాధిపతులకు నా యా భాగముల ప్రజానీక యోగక్షేమాభివృద్ధి బాధ్యత నొప్పగించి యుండిరి. పూర్వమా యాచార్యులు దేశపర్యటన గావించుచు నుండెడివారు. వారా సమయముల సంఘద్రోహాచర్యల నుండువారి దమ ఆధ్యాత్మిక శక్తిచే శిక్షించుచు, సంఘమును బునీతము

గావించుచు నుండెడివారు. అద్వైతానుభూతి నిమగ్నులగు వారు, మహాపురుషులకు సర్వప్రపంచము, దానియందు గల సర్వ చరాచర జీవకోటియు దమ స్వరూపమే యని విస్పష్ట లీల గోచరింప నిక వారు దేనిని నిర్లక్ష్యము సేయుదురు? దేనిని త్యజింతురు? విరాడ్స్వరూపుడైన ఆ యద్వైతానంద స్వరూపునికి సర్వథా తన శరీరాంతర్గతముగ విభాగములే. ఎవడైన తన శరీరమున గల భాగముల గొన్నింటిని నిర్లక్ష్యముగ జూచునా? అట్టి సంకుచిత దృష్టి సర్వ బాధాకరమై, సర్వనాశనకరమని గురెరుంగడా? అట్టి అనుభవ సంపన్నుడగు నద్వైతవాదియు నని గ్రాహ్యము. నిత్య మద్వైతానంద సౌధముల విహరించు శ్రీ రామకృష్ణదేవుడేమి, అద్వైతారణ్య విహారకేసరి యగు వివేకానందుడేమి, సంఘ శ్రేయమును నిర్లక్ష్యము చేసిరా? మీదుమిక్కిలి ప్రపంచవ్యాపక దివ్యోపదేశముల గావించి, సర్వతోముఖాభివృద్ధికై నడుములు బిగించుట సర్వజన విదితము. కాన నద్వైత సిద్ధాంతమున వ్యష్టికి ప్రాధాన్యతనీయక, సమష్టి దృష్టితో వ్యష్టిని బవిత్రము గావించి, సమష్టి దర్శనము గావింపజేసి, వ్యష్టిసమష్టుల యేకత్వమును బ్రస్ఫుటానుభవమున గోచరింపజేసి, సమష్టి రూప సంఘము నుద్ధరించుటయే తాత్పర్యముగా నేర్పడు చున్నది.

మరియు, జీవుడు బ్రహ్మేతర పదార్థముగా దా నెరుంగుటయే భ్రాంతి యనియు, సాధు సాంగత్యము, శ్రవణసాధనాదులచే దానే బ్రహ్మమని ఎప్పుడు గ్రహించుకొనునో అదియే అద్వైతసిద్ధి యనియు సిద్ధాంతము. అనగా నత డెంత

కాలము వ్యాప్తినినియు, నతనికి ప్రత్యేకత గలదనియు నెంచుచు, జాతి మత వర్ణ లింగ భేదముల నెంచుచుండునో అంతవరకత డజ్ఞాని యనియు, నత డద్వయానంద సౌఖ్యమును జూరగొన జాలడనియు, నందుచే క్రమశః యీ విభేదముల దొలగద్రోసి కొనుచు, విశాలత్వమునకు నధిగమింపవలయుననియు నద్వైత, సిద్ధాంతచోదిత సంఘమున సర్వ తారతమ్యములు అదృశ్యమై యెల్లరకు సమాన ప్రతిపత్తి యుండుననియు గ్రహింపదగి యున్నది. వ్యష్టిగత సర్వ తారతమ్యముల నతిక్రమించి, సమష్టి దృష్టిని బెంపొందించుకొనుచు మనుటయే అద్వైతవాద సాధనా విధానముగ నెరుంగవలెను.

అటులనే విశిష్టాద్వైత సిద్ధాంతమునగూడ వ్యక్తము. సర్వము విష్ణ్వంశము, విష్ణ్వంతర్గతము, విష్ణుస్వరూపమే. అద్వయమైన బ్రహ్మము శరీరత్రయాత్మకము. అందు ప్రకృతి స్థూలశరీరము, జీవుడు సూక్ష్మము, ఈశ్వరుడు కారణశరీర మని యీ సిద్ధాంత తాత్పర్యము. అనగా సూక్ష్మదృష్టి ప్రసన్న చిత్తుడై, స్థూలచిత్తమును సూక్ష్మముగావించి, విభిన్న మూర్తులుగ గోచరించు ప్రపంచముపై దృష్టిని దొలగించి, యీ పరమాత్మపై ప్రసరింపజేయుచు, సద్గురు సన్నిధానమున సాధన సాగించుచో, ఆ యనంత కళ్యాణగుణగణ విభూషితు డైన పరమాత్మ కృపాప్రాప్తిచే విశ్వరూపదర్శనము సంప్రా ప్తించును. ఆ దృశ్యమున ప్రపంచము బ్రహ్మేతర పదార్థముగ నుండదు. అజ్ఞానదృష్టి కన్యముగా దోచు జీవులును ఆ దివ్య దృష్టిలో బరబ్రహ్మమున కన్యములుగావుగదా! భగవద్గీతా శాస్త్రమున విశ్వరూపసందర్శన యోగమున దీని రహస్యము

పరిస్ఫుటము. ఈ దర్శనభాగ్యము నొందిన భాగ్యశాలికి దన వ్యక్తిత్వము ప్రత్యేకము గాదనియు, అంశాంశిరూపమున శ్రీమహావిష్ణ్వంతర్గతమనియు, దన శ్రేయము సర్వ శ్రేయమనియు గ్రహించి శ్రేయస్కామియై జాగృతి మెలంగును. శరీరావయవముల నేదేని బాధాకరమై శరీర విచ్ఛిత్తికి గారణముగ బరిణమించిన తన్నిర్మూలన మెట్లు ముఖ్యమో, అట్లే సంఘమునకు బాధాకరముగ రూపొంది సంఘ నాశనమునకు హేతుభూతమైన అరాచక వ్యక్తుల నిర్మూలించుటయు నత్యావసరమని శ్రీవిష్ణువే అవతారముల దాల్చి, ధర్మగ్లాని కాలముల దుష్ట శిక్షణ, శిష్ట రక్షణ కార్యమును ధరించి, యవతరించుటయు గ్రహించి మానవుడు ధర్మతత్పరుడై ప్రవర్తించును. మరియు సంఘమున నెట బాధ యేర్పడినను అది తన సోదర బాధగ స్వీకరించి నివారింప నత డుద్యుక్తుడగును. కరమునకు బాధ యేర్పడిన శరీరమునంతటికి బాధయేగదా! అందుచే బాదము కరగత బాధానివారణమునకై దోడ్పడుటయం దాశ్చర్యము లేదు, అది స్వాభావికమే యగుచున్నది. అంతియగాక నట్టి ప్రవృత్తి సమంజసము, సముచితము. మన శరీరమున నింద్రియములు పరస్పర సహకారులై చెలంగుట నిత్యానుభూతియేగదా. అటుల వ్యష్టి సమష్టి క్షేమమునకై శ్రమించి, వ్యష్టి క్షేమమునే బొందుచున్నది. ఈ విధానము మధ్వాచార్య ప్రతిపాదిత ద్వైతసిద్ధాంతమునగూడ నన్వయము. జీవ బ్రహ్మ ప్రకృతులచే బంచ విభేదముల ద్వైతము సిద్ధాంతము జేసినను అది పరస్పరాధీనముగానబై పద్ధతి యిటగూడ గ్రాహ్యము. ఇదేవిధముగ నితర మతములను

గూడ విశాలదృష్టి బరిశీలించినచో నిదే సిద్ధాంతము వ్యక్తమగును.

## పరిసమాప్తి

అందుచేతనే శాంతస్థితి జీవింప యత్నించుచో "ఆత్మనస్తు కామాయ పతిః ప్రియో భవతి" అని ప్రారంభించి, ప్రపంచమున సర్వ సంబంధముల నెంచి చూపించి, "న వా అరే సర్వస్య కామాయ సర్వం ప్రియం భవతి, ఆత్మనస్తు కామాయ సర్వం ప్రియం భవతి" అని ఉపనిషత్తులు పర్యవసానము దేల్చివైచినవి. లోకమున గల సర్వ సంబంధ బాంధవ్యముల నా యా వ్యక్తుల బాహ్యసంబంధముల గాంచి ప్రేమింపక, వారియందును తనయందును గల సర్వ వ్యాపక సమష్టిరూప సర్వాధారక ఆత్మనే దృక్పథమున నిడుకొని మెలంగవలెనవి ప్రబోధించుచున్నవి. ఆత్మయనిన అనిర్దేశ్యము, అనిర్వాచ్యము, సాధనా సిద్ధము గాన నా యవ్యక్తమును వ్యక్తముగావించి, నా యాత్మనే నారాయణ స్వరూపముగా "అంతర్బహిశ్చ తత్సర్వం వ్యాప్య నారాయణ స్థితః" అను ఉపనిషద్ధమునే గ్రహించి, ఆధునికయుగ శాంతి సంధాతలగు రామకృష్ణ వివేకానందులును, మహాత్ముడును, వ్యష్టిలో గల సమష్టిరూప నారాయణాంశమును దిలకించి, యా నారాయణసేవకై ప్రజానీకమును బ్రబోధించియున్నారు. వారినుండియే బధిరనారాయణ, అంధనారాయణ, దరిద్ర నారాయణాది పదము లుద్భవించి దేశవ్యాప్తి నొంది, సేవా కార్యముల కుత్సాహశక్తుల బ్రసరింపజేయుచున్నవి.

పై విధానమున శాంతి తాత్పర్యమును గ్రహించి,

తదనుభూతిసంపద్విశిష్టుల సన్నిధానమున, సద్విద్యావ్యాసం
గముద్వార యమనియమాది శిష్టగుణ సముపార్జనము
గావించి సంకుచిత లౌకిక దృష్టి కతీతాధ్యాత్మికపథము
నవలంబించి తదనుగుణాత్మక శక్తియుక్తుల అద్భుత ప్రబోధ
ముల హృదయమున స్థాపించి, వ్యష్టి సమష్టి సమన్వయము
గుర్తించి, స్వీయ సంస్కరణమున నాత్మోద్ధరణమును,
తన్మూలమున జగదుద్ధరణమును సంకల్పించి, శ్రమించు
మహోత్తమ విధానము నెవ రాశ్రయించెదరో అట్టివారే
శాంతిసామ్రాజ్యమును బ్రపంచ వ్యాప్తముగ స్థాపింపగల్గు
దురు. తత్సిద్ధికి నెల్లరు యత్నించి, సాధించి గమ్యమును
పొందెదరుగాక! ప్రపంచమున శాంతి నెలకొని శోభిల్లును
గాక! అద్దానికై పరమేశ్వరు డనుగ్రహించుగాక!

"ఉత్తిష్ఠత జాగ్రత ప్రాప్య వారాన్నిబోధత"

"Arise Awake and Stop not till the Goal
is reached"

వాణీప్రెస్, విజయవాడ-2

# అభిప్రాయములు

## సర్వసిద్ధాంత సౌరభము

1. ఆధ్యాత్మిక విజ్ఞాన ప్రచారమునకు యీ గ్రంథరచయిత చేయుచున్న కృషి ప్రశంసనీయమైనది పుస్తకములద్వారా యీ విజ్ఞాన ప్రచారమునకు శ్రీ అనుభవానంద గ్రంథమాల అవిరళ కృషి గావిస్తున్నది.

ప్రస్తుతగ్రంథము సర్వసిద్ధాంతసౌరభము యొక్క దర్శనఖండములో ప్రథమభాగము. దర్శన, అద్వైత, వైష్ణవ, శైవ, బౌద్ధ, సమన్వయ ఖండములలో శ్రీ కపిలమహర్షి ప్రోక్త సాంఖ్య సిద్ధాంతము, శ్రీ పతంజలిప్రోక్త యోగదర్శనము ప్రథమభాగమున పొందు పరచబడినవి. ముఖప్రబంధము, సాంఖ్యదర్శనము, యోగ దర్శనము అను శీర్షికలతో యీవిషయములన్నియు విపులీకరించబడినవి. అనేక ఆంగ్ల గ్రంథములనుండి అవసరమగు చోట్ల కొటేషన్లు యివ్వబడినవి శైలి గ్రాహ్యముగ నున్నది. ఇది తత్వజ్ఞానాన్వేషకులకు, సాధకులకు మిక్కిలి ఉపయోగకరముగా నుండును.

గోలకొండపత్రిక,

2. ఇది వీరు ప్రచురించే దర్శనఖండంలో ప్రథమభాగం మాత్రమే. ఈ సంపుటిలో షడ్దర్శనాలలోను సాంఖ్య, యోగ, దర్శనాలను గురించిన విశేషాలు మాత్రమే చేర్చారు.

సాంఖ్య, యోగదర్శనాలు రెండు మన వేదాంత దృక్పథం అవగాహన చేసుకోడానికి అత్యంత ముఖ్యమైనవి.

మన దర్శనాలన్నిటిలోను సాంఖ్య దర్శనం అత్యంత ప్రాచీనమైనది. యోగదర్శనం దీని తరువాత వస్తుంది.

వీరు రెండు దర్శనాలను గురించి ప్రత్యేకంగా వేర్వేరధ్యాయాలలో వివరించారు.

ప్రత్యేకంగా ఆయా ప్రకరణాలలో ఆయా సిద్ధాంతాలు. దొరికినంత వరకు తత్కర్తల చరిత్రలు, సిద్ధాంతాలలో గల వాదోపవాదాలు మొదలైనవన్నీ విపులంగా వివరించారు.

సాంఖ్యానికి సంబంధించిన అధ్యాయంలో ప్రత్యేకంగా సంస్కృత సాంఖ్యకారికలు కూడా చేర్చారు. అలాగే యోగదర్శనానికి సంబంధించిన ప్రక రణంలో పతంజలి యోగసూత్రాలుకూడా చేర్చారు.

మూలగ్రంథాలను గురించి వీరు వ్రాసినదంతా సంస్కృత వ్యాఖ్యానాల వివరణ శైలిలో ఉదాత్తంగాను నిర్దుష్టంగానూ సాగిపోయింది.

ప్రత్యేకంగాను తెలుగులో యీ దర్శనాలను గురించి యింత విపులంగా

వ్రాసిన పుస్తకాలు చాలా అరుదుగా ఉన్నాయి. అందుచేత తెలుగులో యీ దర్శ నాలను గురించి తెలుసుకోదలచిన వారికిది అవశ్యం చదువవలసిన పుస్తకం.

ఆంధ్ర పత్రిక.

3. శ్రీ అనుభవానంద గ్రంథమాల 11వ కుసుమమిది. శ్రీ స్వాములవారీ మహాగ్రంథమును ఆరు ఖండములుగా వెలయింపదలచినారు. అందు మొదటిదైన దర్శన ఖండంలో మొదటి భాగముమాత్రమే యిది. ఎంత పెద్ద ఎత్తులోయీ గ్రంథ రచనకు శ్రీ స్వాములవారు సంకల్పించారో దీనివలన స్పష్టం.

శ్రీ స్వాములవారు అనుభవానందులే కాదు. సకలశాస్త్రపారంగతులు కూడ. అన్ని శాస్త్రాలు వారికి కొట్టిన పిండివలె ఆయిపోయినవంటే అతిశయోక్తి కాదు. వివిధ సిద్ధాంతాలనుగూర్చి ప్రాచ్య పాశ్చాత్య పండిత అభిప్రాయలన్నీ వారికి హృత్కవిలి. మంచినీళ్ళప్రాయంగా వాటిని ఉదహరించుకుంటూ పోగలరు. అలా ఉదహరించడంలో వారి మనస్సులో మెదిలేది ఆయావ్యక్తుల ఘనతకాదు. వివిధ రీతులుగా ఆయావ్యక్తులనోటి నుండి వెలువడిన విషయగౌరవం. గ్రంథములో విశేష భాగం ఇలా వివిధ పండితుల అభిప్రాయోల్లేఖనలతో నిండిపోవడానికి కారణం ఇదేననిపిస్తుంది.

తాత్వికదృష్ట్యా సాంఖ్య యోగదర్శనములు ఒక జంట... సాంఖ్యానికి ఈశ్వరకృష్ణుని కారికలనూ, యోగానికి పతంజలి సూత్రాలనూ పరిపూర్ణంగా ప్రకటించి, వానితోపాటు యింకా అనేక ఇతర గ్రంథస్థ విషయాలను క్రోడీకరిస్తూ స్వాములవారు వ్రాసిన వ్యాసాలు జిజ్ఞాసువులెల్లరూ చదువదగినది.

ఈ ఆరు ఖండముల ప్రకటనమూగూడ పూర్తి అయ్యేపక్షంలో, ఇది తెలుగులో ఒక మహాగ్రంథమై వెలయగలదనుటకు సందేహములేదు. గ్రంథానికి కొలికి పూస ఆరవఖండమైన సమన్వయ ఖండమని ఊహించవచ్చు. ఆ సమన్వయం చేయడానికి శ్రీరామకృష్ణ పరమహంస సంప్రదాయానికి చెందిన స్వాములవారే ఉత్తమాధికారులు.

కృష్ణాపత్రిక.

4. సర్వసిద్ధాంతసౌరభమును చిత్రించటంలో తమరు అనుసరించిన, మార్గం ఎంతోబాగాఉన్నది. మనవారు యిట్టిఉత్తమ గ్రంథాల్ని చదివినగాని మన సంస్కృతిని చక్కగా గ్రహించటానికి వీలుండదు. ప్రతికళాశాలలో ఉన్నత విద్యాలయంలో యిట్టి గ్రంథం ఉండితీరాలి. విద్యార్థులు యీగ్రంథాన్ని చదవటానికి ప్రారంభించారా వారిని యీ కాలంలో ఎదుర్కొనుచున్న సమస్య లన్నింటినీ సునాయాసంగా పరిష్కరించు కొనవచ్చు. విద్యార్థులకన్నా యీ గ్రంథాన్ని చదువ

వలసినవారు ఉపాధ్యాయులు. అప్పుడే ఉపాధ్యాయులు తమ విద్యుక్త ధర్మాన్ని సొంతంగా నెరవేర్చినవారవుతారు తద్వారా విద్యార్థులకు ఆదర్శమూర్తులు కాగలరు. మన సంస్కృతి చాలా పురాతనమైనదని, దానితో సరిసమానమైనది ప్రపంచంలో ఎక్కడా లేదని చెప్పుకుంటే లాభంలేదు. ప్రవర్థమాన దాని రహస్యాన్ని అర్థం చేసుకోవాలి. అంతేగాదు దానిని తమ జీవితాలల్లో కార్యరూపాన పెట్టాలి. తమ గ్రంథములిట్టి కార్యకలాపానికి ఎంతో సహాయపడగలవు. అందుచేత తాము ప్రారంభించిన పని అంతేవాసులందరికి వారి జీవిత వికాసానికి ఎంతో సహాయపడగలదు

డాక్టరు. వి. యస్. శర్మ, పిహెచ్. డి మద్రాసు.

## శ్రీ మాతాజీ త్యాగీశానంద గ్రంథములు.

1. శ్రీ మాతాజీ త్యాగీశానంద రచించిన "మన రామకృష్ణుడు" "మన శారదామాయి" "మన వివేకానందుడు" అను చిన్ని వచన గ్రంథములను చదివినాను. మృదుమధురమగు భాషతో నలరారు తత్సమ సమాసములతో నొప్పుచు, పిన్న పెద్దలకు గూడ చదువ నింపలరారుచున్నవి సొంపునింపు ఆంధ్రపదజాలములతో ముద్దులొల్కుచున్నవి. ఆమె ఉపనిషద్వేద స్మృతిపురాణేతిహాసాది మహత్తర గ్రంథముల చదివినదిగాన, వానియందలి యనేక లోకోత్తరములగు ఉత్తమ విషయముల శ్లోకముల నుదహరించిచూపుచు మహోన్నత భావములతో ఉపమానములను, చిత్రించి, రచించినది. మహనీయుల చరిత్రములు చిన్ననాటినుండియు పఠించి, యాలించి, వారి ఘనతోదార త్యాగజీవితసార రహస్యములను గ్రహించి మానవులు మహనీయ జీవితా దర్శనీయులై యొప్పుట కర్తవ్యముగా యీ గ్రంథమును స్త్రీ పురుషులెల్లరు పఠింపవలయును. మరియు పాఠశాలలయందు విద్యార్థులకు పఠనీయ గ్రంథములుగా వీనిని ఏర్పాటుచేయుట ముఖ్యమని తలంచుచున్నాను. ఇందు వేద స్మృతి పురాణోపనిషత్కాలములనాడును కలియుగమునందుగల ఉత్తమపతివ్రతలు విరాగసంపన్నులు, ఉన్నత విద్యావతులును, బ్రహ్మచారిణులు, యోగినులును నగు సతీమతులల నెందరినో ఉదహరించినది. ఈ స్త్రీ రత్నములు భారతగర్భ సంజనిత ముక్తామణులని తలంచుచుండ నొడలు పరవశమై బ్రహ్మానందోన్నతిచే నంతరాత్మ చెలగుచుండును.

ఈ చిన్నబిడ్డయగు మాతాజీగూడ ఆనాటి సులభ గార్గేయ మొదలగు భారతీయ యోగినులవలె నొప్పగలదని తలంచుచు, నీమె యింకను, మహత్తర గ్రంథ రచనా నిపుణయై నిరంతర బ్రహ్మానందానుభూతి నోలలాడుచుండు నట్లొనర్పుమని పరమేశ్వరుని ప్రార్థించుచున్నాను.

శ్రీమతి గుడిపూడి ఇందుమతీదేవి

## సాధన రహస్యము

భీమునిపట్నంలో శ్రీ శారదా రామకృష్ణ సంఘము, బాపట్లలో శ్రీరామకృష్ణ భక్తసమాజమూ స్థాపించి, బాపట్లలోనే శ్రీ బ్రహ్మానందాశ్రమం నిర్మించి, శ్రీ అనుభవానంద గ్రంథమాల ద్వారా తెలుగునాటికి అనుభవంతోగూడిన తత్త్వబోధలు నిత్యోత్సాహముతో చేస్తున్న మహనీయులు శ్రీ అనుభవానంద స్వాములవారు. గొప్పపండితులేకాక, గొప్పకవులుగూడ. చక్కని భాషలో పాటలూ, పద్యాలూ, వ్రాయగలరు. వ్రాశారు. ఈ గ్రంథమాలలో మొదటినాలుగు కుసుమములూ అవే. స్వాములవారు ముచ్చటైన వ్యావహారికభాషకూడా వ్రాయగలరనడానికి యీ "సాధన రహస్యం" నిదర్శనం.

సాధన రహస్యం యిందులో లేఖలరూపంలో వివరించబడింది. పదమూడేండ్ల ఒక ఆడపిల్లకోసంగా వ్రాసినవైనందుకు, ఎంతో సరళత్వం సాధించి కృతకృత్యులైనారు స్వాములవారు. ఈ బాలిక పూర్వజన్మ సంస్కార ఫలితంగా చిన్ననాటినుంచీ ఆధ్యాత్మిక జిజ్ఞాస కలిగి సాంసారిక ప్రవృత్తి రహితమైన చిత్తంతో స్వాములవారినాశ్రయించిన ధన్యజీవి. ఆధ్యాత్మిక నిష్ఠయందు వయస్సుతోబాటు ఎదుగుచూ, ఆమెయే యిప్పుడు "మాతాజీ" యనుపేర బాపట్ల ఆశ్రమానికి దివ్వెయై వెలుగుతున్నది. ఆమెను శిష్యురాలుగా బడయుట శ్రీ స్వాములవారి అదృష్టంకూడ.

ఈ గ్రంథంలో 36 లేఖలున్నాయి - మొదటి ఉత్తరంలోనే, చిన్న పిల్లలకు సైతం బోధపడేటట్లు తత్త్వవిషయాలు చెప్పడంలో స్వాములవారికి చక్కని ప్రజ్ఞ ఉన్నదని స్పష్టపడిపోతుంది. యోగం - ఇంద్రియాలు - ప్రత్యక్షం భ్రమ - అనుమానం - శబ్దం - జగత్సృష్టి - నిమిత్తోపాదానకారణాలు - ప్రధానవాదం - పరిణామవాదం - వివర్తవాదం ఈవిషయాలను వీరు చెప్పిన ధోరణిచూస్తే ముచ్చటవేస్తుంది. పెద్దల మనుకునేవారూ పిన్నలై కూర్చుండి వినవచ్చు.

ఈ ధోరణిలోనే, ఒక లేఖలో కర్మయోగం వివరించబడింది. పదమూడు లేఖలలో రాజయోగం విస్తరించబడింది. నాలుగు లేఖలలో భక్తియోగము, ఆరు లేఖలలో జ్ఞానయోగము బోధించబడింది. సాదనచతుష్టయసంపద లేనిదే తత్త్వజ్ఞానం ఫలించదు. కనుక చివరలేఖలలో దానిని ప్రత్యేకంగా విశదీకరించారు. ప్రతివారూ చదువుకోవలసిన గ్రంథం. 1946 లో ఒక మూడు నెలల కాలంలో వ్రాసి ముగించిన లేఖలివి - మంచికాగితంమీద, గ్రంథం చక్కగా ముద్రించబడింది. ఉత్తమ సంస్కారంతో పుట్టిన ఒకబాలిక నిమిత్తంగా పుట్టిన గ్రంథం కావడంతో దీని పవిత్రత ఇనుమడిస్తున్నది.

"కృష్ణాపత్రిక"

# అనుభవానంద గ్రంథమాల - బాపట్ల

## ప్రచురణములు

---

1. శ్రీ రామకృష్ణ లీలాసంకీర్తనము : (8వ ముద్రణము) శ్రీ రామకృష్ణ, శారద వివేకానందులగూర్చి భక్తిప్రబోధకరముగా 149 కీర్తనలు 1/16 డెమ్మి, 420 పుటలు
2. శ్రీ రామకృష్ణాంజలి: ( 4వ ముద్రణము ) శ్రీ రామకృష్ణ, వివేకానంద తత్త్వములగూర్చి భక్తి ఉత్సాహపూరిత పద్యములు 100. 0_25
3. శ్రీ దక్షిణేశ్వరీ స్తవము: (3వ ముద్రణము) భక్తితో దత్త్వ విషయముల ప్రబోధించు శతకము. 0_25
4. చిత్తప్రబోధ : (3వ ముద్రణము) సాధకుల కనేక అమూల్య రహస్యముల బోధించు శతకము. 25_00
5. సాధన రహస్యము : (6వ ముద్రణము) ఆధ్యాత్మికాభివృద్ధికి మూలమైన యోగసూత్ర సాధన చతుష్టయముల చక్కని శిష్ట వ్యావహారిక భాషలో తెలిపిన సుప్రసిద్ధ గ్రంథరాజము. 1/8 క్రౌను 348 పుటలు 4_00
6. అనుభవానందము : (3వ ముద్రణము) అద్వైతానంద విభూతిని వ్యక్తపరచు శతకము. 0_12
7. సాధన సుధ : (2వ ముద్రణము) సాధనలో దగులు ఆటంకముల నివారింప అమూల్యమగు సలహాల నొసంగు పద్యగ్రంథము. 1/8 క్రౌను 100 పుటలు 1-00
8. మన శారదామాయి: (3వ ముద్రణము) శ్రీ త్యాగీశానంద విరచితము. జగన్మాత శ్రీ శారదామాయి జీవితోపదేశముల వివరించు ఉత్సాహపూరిత సులభ గ్రంథము. 1/8 క్రౌను. 116 పుటలు 2_00

9. మన వివేకానందుడు : (3వ ముద్రణము) శ్రీ త్యాగీశానంద విరచితము. వేదాంతకేసరి శ్రీ వివేకానందుని జీవితాదర్శముల ప్రబోధించు ఉత్కృష్ట గ్రంథము. 1/8 క్రౌను. 110 పుటలు 2-00

10. మన రామకృష్ణుడు : (3వ ముద్రణము) శ్రీ త్యాగీశానంద విరచితము, జగద్గురు శ్రీ రామకృష్ణుని అద్భుతాదర్శ సాధన వివరముల సుగమము గావించు గ్రంథము.
1/8 క్రౌను. 125 పుటలు 2-00

11. సర్వ సిద్ధాంతసౌరభము: 1వ సంపుటము. (2వ ముద్రణము) దర్శన ఖండము — ప్రథమ భాగము — సాంఖ్యయోగములు. శ్రీ కపిల పతంజలి మహర్షుల జీవితకాల విశేషములు సిద్ధాంతములు యిట దర్శితము. 1/8 క్రౌను. 380 పుటలు 4-00

12. శాంతి సామ్రాజ్యము : (2వ ముద్రణము) శాంతినిగోరు నేటి ప్రపంచమునకు శాంతి ప్రబోధ గావించు ఉత్తమగ్రంథము.
1/8 క్రౌను. 40 పుటలు 1-00

13. శ్రీ రామకృష్ణాదర్శము : (2వ ముద్రణము) శ్రీ రామకృష్ణుని సాధన, సిద్ధుల రహస్యమును వివరించు ఉత్తేజకర విపుల గ్రంథము. 1/8 క్రౌను. 20 పుటలు 0-15

14. శ్రీ రామకృష్ణ పూజ : (2వ ముద్రణము) శ్రీ రామకృష్ణ పూజా విధానము సహస్ర అష్టోత్తర శత నామములతో నలరారు గ్రంథము. 1/16 డెమ్మీ. 70 పుటలు

15. సర్వ సిద్ధాంత సౌరభము: 2వ సంపుటము. దర్శన ఖండము—ద్వితీయ భాగము—వైశేషిక న్యాయములు—శ్రీ కణాద గౌతమ మహర్షుల జీవితకాల సిద్ధాంతములు పండితాభిప్రాయములతో రచితము. 1/8 క్రౌను. 300 పుటలు 3 00

16. సర్వ సిద్ధాంత సౌరభము : 2వ సంపుటము. దర్శన ఖండము—తృతీయ భాగము—మీమాంసాద్వయము—శ్రీ జైమినీ వ్యాస మహర్షుల జీవితకాల సిద్ధాంతములు ఆధునిక పండితాభిప్రాయములతో రచితము. 1/8 క్రౌను. 340 పుటలు 3-00

17. సర్వ సిద్ధాంత సౌరభము: 4వ సంపుటము. అద్వైత ఖండము - ప్రథమ భాగము - శ్రీ శంకర పూర్వాద్వైతము- వేదములనుండి శ్రీ శంకరుల వరకు ప్రవహించు అద్వైత రసప్రవాహమును తెలుపు విపుల గ్రంథము. అద్వైతసిద్ధాంత మునకు, ఆధునికి భౌతిక విజ్ఞానమునకు సమన్వయము జూపును.
1/8 క్రౌను 440 పుటలు 4-25

18. మాండూక్య రసాయనము : ( 2వ ముద్రణము ) శ్రీ అనుభవభాష్యము. 108 ఉపనిషత్తుల ముఖ్యమంత్రము లతో, గౌడపాద కారికలతో వ్యాఖ్యాతము
1/8 క్రౌను 160 పుటలు 2-50

19. సర్వ సిద్ధాంత సౌరభము: 5వ సంపుటము. అద్వైత ఖండము ద్వితీయభాగము-శ్రీ శంకరాద్వైతము శ్రీ శంకర జీవితకాల విశేషములు, అద్వైత సిద్ధాంతము విస్తృతముగా వివరింపబడినవి. సన్న్యాస ప్రాశస్త్య, అధికార వివరము లును గలవు.
1/8 క్రౌను. 520 పుటలు 4-25

20. సర్వ సిద్ధాంత సౌరభము : 6వ సంపుటము. అద్వైత ఖండము - తృతీయ భాగము - శ్రీ శంకరానంతరాద్వైతము శ్రీ సురేశ్వర, విద్యారణ్య వివరణము విపులముగా నిందుండును.
1/8 క్రౌను. 315 పుటలు 3-25

21. ప్రాచీన భగవద్గీత : (2వ ముద్రణము) 745 శ్లోకములు గల అసలు గీత. భోజపత్ర వ్రాతప్రతినుండి ఉద్ధృతము
1/8 డెమ్మీ. 150 పుటలు

22. సర్వ సిద్ధాంత సౌరభము : 7వ సంపుటము. వైష్ణవ ఖండము-ప్రథమ భాగము - విశిష్టాద్వైతము - వేదములనుండి వైష్ణవసిద్ధాంత జనన చారిత్రము శ్రీ రామానుజ జీవితసమీక్ష, విశిష్టాద్వైత సిద్ధాంత వివరణములు యిందు ప్రస్ఫుటము.
1/8 క్రౌను. 350 పుటలు 3-25

23. (శ్రీ) వివేకానందాదర్శము : (2వ ముద్రణము) శ్రీ వివేకానందుని ఆదర్శము యిందు ప్రస్ఫుటముగ రచితము.
1/8 క్రౌను 40 పుటలు 0-40

24. (శ్రీ) శారదాదర్శము ; శ్రీ శారదాదేవి గొప్పదనముచే మన హృదయముల గదలించును. 1/8 క్రౌను. 20 పుటలు 0-15

25 సర్వసిద్ధాంత సౌరభము : 8వ సంపుటము. వైష్ణవ ఖండము-ద్వితీయభాగము వైష్ణవము. శ్రీ మధ్వాచార్యునినుండి శ్రీకృష్ణచైతన్యునివరకు గల వైష్ణవాచార్యుల జీవిత సిద్ధాంత విషయములు సమీక్షింపబడినవి. 1/8 కౌను 340 పుటలు 3-25

26. సాధన మకరందము : (2వ ముద్రణము) శ్రీ స్వామివారు 1941లో సంవత్సర మౌన దీక్షాకాలమున, అన్యులకు వ్రాసిన సమాధాన వచనము. సాధన విషయము లేగాక అనేక అవసర విషయముల విచారణ మిందు గలదు.
1/8 క్రౌను. 125 పుటలు 2-00

27. సర్వ సిద్ధాంత సౌరభము : 9 వ సంపుటము. శైవఖండము-ప్రథమ భాగము - శైవాద్వైతము. వేదముల రుద్రాధ్యాయ జనితమైన శైవసిద్ధాంతము వీరశైవము వరకు ఎటు పరిణమించి యున్నదియు నిట స్పష్టము. నాయనారుల జీవితములు గలవు. 1/8 క్రౌను 330 పుటలు 3-25

28. సర్వ సిద్ధాంత సౌరభము : 10 వ సంపుటము. శైవఖండము-ద్వితీయ భాగము-శాక్తాద్వైతము-వేదాంతర్గత దేవీసూక్త అదితి ప్రస్తావనములతో ప్రారంభమై. దక్షిణ వామాచార రూపమున సర్వత్ర ప్రఖ్యాతినొందిన శాక్త సిద్ధాంత సాధనములతో వివరింపబడినది. 1/8 క్రౌను. 450 పుటలు 4-25

29. సర్వ సిద్ధాంత సౌరభము : 11 వ సంపుటము. బౌద్ధ ఖండము - ప్రథమ భాగము - బౌద్ధసిద్ధాంతము. (అచ్చులో)

---

★ వి. పి. ద్వార పుస్తకములు పంపుటకు సగము పైకము ముందుగా పంపవలెను.